క్రమముగా కొంచెము చదువుకొన్నది. కాని, ఆమె ధీరత్వము దైవభక్తి, ధర్మశీలత, పాతివ్రత్యమువల్ల ఆమె హిందూనారీ లోకమునకు నాయకమణియయినది. భర్త బారిష్టరై వచ్చిన తరువాత (మొదటిసారి దక్షిణాఫ్రికాకు వెళ్ళినప్పుడు తప్ప) ఆమె యెన్నడూ తనభర్త నెడబాయక ఆయన ఆత్మపరిశోధన, సత్యాగ్రహము, లోకసేవాకార్యము లన్నిటిలో తాను సహకారిణియై, భర్త కెప్పుడునుతోడ్పడుచుండెను.

ఆమె తన నలుగురు కుమాళ్లలో హరిలాలుగాంధి అవిధేయుడయినందున కెంతయు దుఃఖించి, అతని కుమారుడగు కనూగాంధిని తనయొద్దనే ఉంచుకొని, గాంధియాదర్శముల నలవరచి వృద్ధిచేసెను. నాల్గవకొడుకు దేవదాసు ఆమె ముద్దుబిడ్డడు. ఆకారంలో, సౌజన్యంలో, వివేకంలో, ప్రజాసేవలో, వారి ప్రతిబింబమై ఆతడు తల్లిదండ్రులకు ఖ్యాతిని తెచ్చినాడు.

దక్షిణాఫ్రికాలో 40 ఏండ్ల వయస్సులోపుననే గాంధిగారు బ్రహ్మచర్యవ్రత మవలంబించిరిగదా ! అప్పటినుండియు కస్తూరిబాయియు భర్తతో నుండుచునే సంపూర్ణనిగ్రహ మలవరచుకొని, బ్రహ్మచారిణిగ నుండినది. (గృహస్థు లందరును పౌత్రులు కలుగగనే కుటుంబసుఖమును వదలి శాస్త్రరీత్యా వానప్రస్థులుగ జీవితము గడపవలెను. అప్పుడే వర్ణాశ్రమ ధర్మము రక్షితమగును, ఆమె యిట్లు భర్తతో అసిధారావ్రత

మవలంబించుటేగాక భర్త జాతీయసేవ, ఆహారవిహారనిగ్రహ
ము, ప్రజోద్యమములు, వీట్లలో పాల్గొనుట, అలంకారాలను
ఆభరణాలను వదలెను. లోకులు భర్తకేగాక తన కిచ్చు కాను
కలనుగూడ ఆమె ప్రజాసేవ కిచ్చివేసెను. తన కొడుకులకు భర్త
ఆంగ్లపాఠశాలలో విద్యను, ఉద్యోగసాధనాలను లేకుండజేసి
నను సమాధానపడెను, సంఘసేవాపరుడగు భర్త నిరంతర
కార్యపరుడైనందున ఆయన ఆరోగ్యము, చిత్తశాంతి, సౌమ
నస్యము, చెడకుండుటకై కంటికి రెప్పవలె రక్షించి, ఉపచా
రము చేయుచుండెను. తీవ్రాదర్శపరుడగు భర్తజీవితము కత్తి
సామువంటిది, అట్టి వారిభార్య వారితో సరిపెట్టుకోలేక కో
పిష్టి యగుటయు, కుటుంబసుఖము చెడుటయు, తరుచు సంభవిం
చును; సోక్రటీసు, రామానుజులు మొదలగు తత్త్వవేత్తల
దాంపత్యబాధలు చరిత్రప్రసిద్ధములు. మరియు గాంధిగారు
సర్వవేళలందును వివిధకార్యమగ్నులగుటచే, ఎల్లకాలముల
లోను రకరకముల అతిథులు తనయింటికి వత్తురు; ఇంట ద్రవ్య
ముండదు. తమది కేవలము సాత్విక మితాహారమయినను,
అతిథులు తినగల ఆహారమిచ్చి సత్కరింపవలెను. వ్యక్తిగత
ముగా బాల్యమునుండి పూర్వాచారపరురా లయినను, ఆమె
ముస్లిములు, క్రైస్తవులు మున్నగు అందరిని ఆతిథ్యముతో
ఆదరింపుచుండెను. ఇందుకుతోడు, హరిజనుల అస్పృశ్యతను
తొలగింప కంకణము కట్టుకొన్న భర్త మాలమాదిగలకును

భార్య చేత ఉపచారము చేయించుకొనుటేగాక లక్ష్మియను మాల పిల్లను తనకుమార్తెగా పెంచుకొనెను. మొదట ఈ ఉదారాశయముల మహాత్త్వమును తాను గ్రహింపలేకున్నను, భర్తయందున్న అనురాగభక్తులనుబట్టి 'మగనితోడిదే మగువజీవిత' మని తాను సర్దుకొని, ఆమాలపిల్లను దగ్గిర పెంచి,అన్ని కులాలవారిని, అన్నిప్రాంతాలవారిని సమానముగ నాదరించుచు, మహాత్ముని ఉద్యమము లన్నిటికి తోడ్పడుచుండెను. దక్షిణాఫ్రికాలో భారతీయులను కూలీలను, అస్పృశ్యులుగ చూచుచు వారిని పెట్టు విపరీతబాధలను, జాతిద్వేషపు న్యాయ తను భర్తతోబాటు తానును అనుభవించెను; భర్తతోబాటు సత్యాగ్రహం చేసి ఆయన వెనుకనే జైలుయాత్ర సాగించి, ఖైదీగ రాయిరప్పల గొట్టి, సంతుష్టితో కష్టాలు సహించెను. ఆపరాయిదేశములోగూడ హరిశ్చంద్రునివంటి భర్తతోబాటు సత్యమును, సత్యాగ్రహమును సాగించి జయమునుచేకూర్చెను. (ఇప్పుడు వీరి రెండవ కుమారుడు మణిలాల్ గాంధిగారు దక్షిణాఫ్రికాలోనే ఉండి, మరల శ్వేతజాతీయులతో తీవ్రముగా పోరు సాగించుచున్నారు.)

1915 సం॥రం నుండి మనదేశములో సబర్మతీసేవాగ్రామముల ఆశ్రమాలలో ఈమె సత్కారమును మనదేశపు నాయకులు, సంఘసేవకులును పొందినారు. ఎందరో విదేశీయులును వచ్చి ఆమె యాతిథ్యమును సౌజన్యమును మెచ్చుకొన్నారు. కొందరు తెల్లవారు, హరిజనులు, సనాతనులు, ఎవరో గుండాలు, ద్వేషపూరితులై గాంధిగారిని కొట్టి

హింసింపవచ్చిరి; అట్టి తీవ్రఘట్టాలను లక్ష్యంచేయక తిరిగేభర్త కషాయము రాకుండ ఆమె వేయికండ్లతో కనిపెట్టుచుండెను. దైవకృపవల్ల, వారి కషాయముతప్పిపోవుచుండెను. గాంధిగారు సాగించిన ఖాదీ, మద్యనిషేధం, హరిజనసేవ, హిందీప్రచారముమొదలగునిర్మాణకార్యాలన్నిటిప్రచారమునుముఖ్యముగా స్త్రీజాతిలో బాగా వ్యాపింపచేయుటలోను, స్వాతంత్ర్యయుద్ధములో స్త్రీలుపాల్గొనునట్లుచేయుటలోను, నిశ్శబ్దముగా, నిరాడంబరముగా, పేరు కోరకుండా, ఆమెచేసిన కృషి అపారము. తిలకు మున్నగుఇతరనాయకుల ఉద్యమాలకన్న గాంధిఉద్యమములో స్త్రీలెక్కువ పాల్గొన్నమాట నిర్వివాదము. అందుకాయన సహధర్మచారిణి సహకార మెంతయు తోడ్పడినది. ఆరంభస్థితిలో భర్తతో వాదించి తగువుపడినను, ఉభయులమధ్య పరస్పరగౌరవ మెప్పుడూ చెడలేదు. కుటుంబకలహములోను భర్త సత్యాగ్రహపద్ధతి నవలంబించుటవల్ల పిమ్మట ఉభయుల మధ్య కలతలుపోయి, ప్రేమభావము మరింత స్థిరపడినది. 1940 సం॥రం నుండి, ఈసాధ్వీమణి ఆరోగ్యము చెడుచుండెను. కాని, 1942 ఆగష్టులోను బొంబాయిరంగంలో హాజరై ఆగాఖాను జైలులో చేరెను. అప్పటినుండి విరేచన వ్యాధి ప్రబలి ఆమె నీరసించి క్షీణించెను. అంత్యదశ సమీపించినప్పుడు సర్కారును వేడి ప్రాణభిక్ష పొందదలచుకో లేదు. తుదకు 22-2-44 తేదీని ఈ ఆదర్శసుమంగళి భర్త



మాతా కస్తూరిబా గాంధీ — బాపూజీ.

హస్తములందే మరణించెను. వారి పరివారములోని ప్యారీ లాలు, డా. సుశీలానయ్యరు ఇత్యాదులనే గాక దేశమంతటి నీశోకవార్త దుఃఖసముద్రమున ముంచెను.

ఇట్లు మనసంప్రదాయప్రకారము ఆదర్శముగా వర్తించిన ఆ మహిళామణికి స్మారకముగా, ఆమె వయస్సు 75 ఏండ్లనుబట్టి 75 లక్షలరూపాయల నిధిని వసూలుచేయ కొందరు సంకల్పించిరి. కొద్దినెలలలోనే అందుకు కోటి యిరవైలక్షలు వసూలగుట గాంధిదంపతుల ఖ్యాతికి, జనుల కృతజ్ఞతకు గూడ నిదర్శనము. దీనిని సవ్యముగా వ్యవహరించుటకొకధర్మసంస్థ యేర్పడెను. దాని సభ్యులు గాంధిగారి నధ్యక్షులుగ నెన్నుకొనిరి. ఈసంస్థ కస్తూరిబాగాంధి జాతీయస్మారక ధర్మసంస్థ. అదిస్త్రీజాతి యున్నతికే కృషిచేయవలె. స్త్రీలెందరో ప్రసవవ్యాధులకులోనై మరణింతురు. శిశుమరణములును మనదేశములో హెచ్చు. ఆసుపత్రులు బస్తీలకే బాగా వినియోగమగుచున్నవి మరియు స్త్రీలలో తగువిద్య లేకున్నది. కనుక, ఈనిధితో, ప్రసవసౌకర్యమునకు, స్త్రీవ్యాధిచికిత్సకు ఆసుపత్రులను, నవ్య జాతీయవిద్యాలయాలను స్త్రీలకై గ్రామాలలోనే నడుపనిశ్చయమైనది. "నీవు జైలులో మరణించితే, నిన్నొక దేవిగ పూజింతును" అని గాంధిగారొకప్పుడు చలోక్తిగ భార్యతోననెను. ఈ అమోఘవాక్కు సఫలమై, క్రియలో విగ్రహపూజగ మాత్రమే సమాప్తముగాక, భారతీయులు ఆమెకుచేయుగౌరవము

వల్లస్త్రీజాతికిలాభముకలుగునట్లు మహాత్ముడుచేసినారు. ఈధర్మ సంస్థ నిర్వహణము చాలవరకు ప్రసిద్ధ దేశసేవికలగు యోషామణుల హస్తములలో నున్నది. శ్రీమతి సుచేతా కృపలానీ మున్నగు మహిళలెందరో యీ భారమును వహించుచున్నారు. ఈవిధానముప్రకారము దేశమంతట కస్తూరిబా పేరిట ఎన్నియో ప్రసూతిచికిత్సాశాలలు, ప్రాతిపదిక విద్యాలయాలును సాగింపబడుచున్నవి. ఈనిధి యింకను వృద్ధియగుచున్నది. కస్తూరిబా భౌతికముగా మరణించినను, దీనిద్వారా భారతమహిళోద్ధరణకు తోడ్పడుచు చిరంజీవురాలాయెను.

---

# 49. వంగ దక్షిణ యాత్రలు

1943-44 సం॥రములలో దేశసమస్యనుగూర్చి గాంధి వవెలుగార్లమధ్య కొంత ఉత్తరప్రత్యుత్తరములు జరిగినవి. 'క్విటిండియా' మంత్రముపసంహరింప గాంధిగారు నిరాకరించిరి. సత్యాగ్రహ' ముపసంహరించుకొమ్మన్న తాను ప్రారంభించని సత్యాగ్రహమును మానుటేమిటని? మరియు, ఆతీర్మానము కాంగ్రెసు సమితిది; దాని సభ్యులు విడుదలమై

వారితో సంప్రదించినప్పుడే ఆ ప్రశంస వచ్చును, అని గాంధి గారనిరి. తుదకు అనారోగ్యముగ నున్నదను మిషతో బేషరతుగనే 1944 సం॥రం మేలో వైస్రాయి గాంధిగారిని విడి పించెను. 1944 మే నుండి, గాంధిగారు దేశంలోని వివిధసమ స్యల పరిష్కారమునకు తీవ్రకృషి నారంభించిరి. ముందుగ సవర్ణహరిజన సఖ్యమును, హిందూముస్లింమైత్రిని బలపర్చుట కాయా సంఘములతో కలసి దేశసంచారంచేసిరి; జనులలో ప్రబ యున్న హింసాద్వేషభావాలను పోగొట్టి పరస్పరప్రేమను వృద్ధిచేయబూనెను; ఆహారవస్త్రముల సమస్యలను ప్రజలు పరిష్కరించుకొనుటకు స్వయంసహాయాధారమగు కొన్ని అమూల్యసూచనలను చేసెను; అప్పుడే; రాజ్యాంగసమస్య పరిష్కారమునకై సిమ్లాసమావేశములో పాల్గొనెను.

ప్రజల ఆవేదనవల్ల, సర్కారు ఉద్యోగుల నిరోధము వల్ల, కొన్ని నిర్మాణసంస్థలు కుంటుబడియుండెను. ఆ విష వాతావరణములో ఛిన్నభిన్నమైన చరఖాసంఘు; హరిజనసేవక సంఘు, గ్రామోద్యోగసంస్థలను పునరుద్ధరించి, సమయోచిత ముగా ఆయన వాటికి నవజీవనమును, కొత్తదృక్పథమును కల్గించెను.

ఈలోగా బెంగాలు దుస్థితి దుస్సహమయినది. అక్కడ గింజల సరఫరాను మిలిటరీ అవసరాలకై సర్కారువారు వశపర్చు కోగా, క్షామంవల్ల 25 లక్షల జనులు చచ్చిరి. అక్కడి ముస్లింలీగు ప్రభుత్వము తగుచర్య చేయలేకపోయెను. బర్మా కాందిశీకులద్వారా బెంగాలులో (కొంచెముగా మనప్రాంత

ములోను) క్రొత్త వ్యాధులు వ్యాపించెను. కొంత వరదల నష్టము కల్గినది. ఈ యాతిబాధలనుండి తగు ప్రతిక్రియల సూచించుట కాయన వంగదేశమునకు వెళ్ళి, రెండు నెల లక్కడిజనులకు ధైర్యము కల్గించి, నిర్మాణాత్మకమగు ప్రక్రియలను సూచించెను. లక్షలకొలది జనులాయనను దర్శించి ప్రతిరోజు 'సోదేపురాశ్రమములోని సాయంత్ర ప్రార్థనలలో పాల్గొని, ఆయన ఉపదేశముల విని, మనశ్శాంతిని పొంది, ఉత్సాహితులై, ఉద్యమపరులైరి.

గాంధిగారంతట మద్రాసుకు విచ్చేసిరి. 1937 సం॥రం తరువాత, మరల 1946 జనవరి 20 తేదీని కలకత్తానుండి ప్రత్యేకపు ట్రెయినులో బయలుదేరివచ్చి, మద్రాసు హిందీ ప్రచారసభ కార్యాలయములో బసచేసిరి. దక్షిణ భారత హిందీ ప్రచారసభవారి రజతజయంతి ఉత్సవ మంతకుముందే జరుగవలసియుండియు, దాని అధ్యక్షులగు గాంధిమహాత్ముని రాకకై నిలుపబడెను. అక్కడ ఆయన వసించిన 12 రోజులలో ఆయన నిర్మాణకార్యసమావేశాలలోనే మగ్నుడాయెను. హిందీ ప్రచారసభవారి రజతజయంతి ఉత్సవము, వార్షిక పట్టప్రదానోత్సవము(కాన్వొకేషను)మాత్రమేగాక, ఖాదీ, హరిజనోద్ధరణ, గ్రామపరిశ్రమలు, జాతీయసాహిత్యము మున్నగు ఇతర విషయాలనుగూర్చి గాంధిమహాత్ముడుప్రశ్నలకుసమాధానముగ తన అభిప్రాయాలను హిందుస్తానీభాషలో తెల్పుచువచ్చెను. ఆరోజులలో వేలకొలది హిందీప్రచారకులు మున్నగు నిర్మాణ కార్యకర్తలేగాక, సాయంకాల ప్రార్థనలలో ప్రతిరోజు లక్ష

వరకు జనులు వచ్చుచు, ఆయన యుపదేశముల వినుచుండిరి. అప్పుడాయన ప్రాంతీయ రాజకీయసమస్యల నెత్తుకోక, కేవలం నిర్మాణ కార్యక్రమపు ఆవశ్యకతనుగూర్చియే ప్రబోధముచేసిరి. 1-2-46 తేదీని మద్రాసులో హరిజనులకై క్రొత్త పరిశ్రమా లయమున శంకుస్థాపనచేసి, గాంధిగారు మరునాడు తమిళ నాడులోని, హరిజనులకు మొదట ప్రవేశమిచ్చి మార్గదర్శక మైన మధుర, పళని దేవాలయములకు యాత్రచేసిరి. అక్కడ నుండి మరలి వెళ్ళునప్పుడు, బెజవాడలోని ఆంధ్రరాష్ట్ర హిందీప్రచార సంఘ భవన నిర్మాణము నాశీర్వదించి, ఆంధ్రు లకు లిఖిత సందేశమునొసంగిరి.

సందేశము.

ఆంధ్రదేశమునుండి నేను చాలా ఆశించుచున్నాను. ఆంధ్రులు నా ఆశయములను తప్పక నెరవేర్తురని నా పూర్ణ విశ్వాసము.

అస్పృశ్యతను పోగొట్టవలెను. దేవాలయము లన్నింటి లోను హరిజనులకు ప్రవేశ మొసంగవలెను. ఇంటింట రాట్నము తిరుగవలెను. అందరును ఖాదీ ధరించవలెను. జాతీయైక్యతా నిర్మాణము జరుగవలెను. మాతృభాషను అభ్యసించవలెను. రాష్ట్రభాషయగు హిందూస్తానీని దేవనాగరి, ఉర్దూ రెండు లిపులలో నేర్చుకొనవలెను.

ఖాజీపేట
5-2-46

(సం) మో. క. గాంధి.

# 50 సిమ్లా సంభాషణలు

దేశపు అశాంతిస్థితిలో వెంటనే ప్రజానాయకులతో రాజీచేసికొని, భారతప్రభుత్వమును ప్రజానాయకులతో పునర్నిర్మాణము చేయుట ఆవశ్యకమని బ్రిటిషుప్రభుత్వమువారు గమనించిరి. అప్పుడు బ్రిటనులో పార్లమెంటు ఎన్నికలు జరుగగా అందులో చర్చిలు పక్షపు కాన్సర్వేటివు లోడిరి; లేబరు (కార్మిక)పక్షమువా రధికారమునకువచ్చిరి. సిమ్లాలోవైస్రాయి ఎవెలు గారు గాంధిగారిని, కాంగ్రెసు ముస్లింలీగునాయకులను, ఇతర ప్రముఖులను, పిల్చి కొంత చర్చ జరిగించిరి. లోగడ జరిగిన 'దేశాయి లియాకతు' సమాఖ్యను కొంత మార్చి కేంద్రప్రభుత్వ సభ్యులలో సవర్ణహిందువులు, ముస్లిములు సమసంఖ్యగ నుండుటకొప్పుదలచేసిరి. ముస్లిములందరు లీగు పక్షీయులే, తనచేనియమితులే ఉండవలెనని లీగునాయకుడు జిన్నాగారు పట్టుబట్టగా, అందుకు కాంగ్రెసు ప్రముఖులే గాక పంజాబునాయకులు నొప్పుకోలేదు. ఆసమావేశ మట్లు నిష్ఫలంకాగా గాంధిగారు తక్కిన నాయకులతోబాటు వచ్చివేసిరి. అప్పుడు వైస్రాయి బాధ్యతవహించి వెంటనే పరిష్కరించవలసినది గాని అట్లు చేయలేదు.

# 51 కొత్తయెన్నికలు

ముస్లిములందరికీ లీగుపక్షమే ఏకైకప్రతినిధి అను తన వాదమును సమర్థించుకొనుటకు వెంటనే శాసనసభ లన్నిటికిని ఎన్నికలు జరిపించవలెనని జిన్నాగారప్పుడు వాదించిరి. ఎన్నిక ద్వారా ప్రజాభావమువ్యక్తమగుటకు కాంగ్రెసువారును సమ్మతించిరి. కాని, 6 ఏండ్లనుండి విదేశప్రభుత్వపు అండతోను, నవాబులు జాగీర్దారులు మున్నగు ధనాఢ్యుల పూర్ణసహాయముతోను, మతమూర్ఖులగు సాంఘికతత్వపరుల మద్దతుతోను లీగువారు ముస్లిముజనులలో బాగాపలుకుబడిని సంపాదించిరి. అట్టివారితో మొన్నటివరకు అక్రమ సంఘముగానుండి అంగబలము, అర్థబలము లేకున్న జాతీయముస్లిములు పోరు టెట్లు? చాలవరకు ధనికులకే వోటుహక్కు. అదిగాక తగినంత వ్యవధి నీయక 1945 సం॥రం అక్టోబరులోనే కేంద్రసభకును, 1946 ఫిబ్రవరిప్రాంతములో రాష్ట్రసభలకును, లోపభూయిష్టమగు వోటరుజాబితాలతోనే సర్కారువారు యెన్నికలు జరిపించివేసిరి. తక్కిన యితరస్థానాలు చాలవరకు కాంగ్రెసువారికే లభించినవి. ఈసారి అస్సాం, వాయవ్యసరిహద్దు రాష్ట్రాలలోను, కాంగ్రెసుకు 'మెజారిటీ' (హెచ్చుస్థానాలు) లభించెను. కాని, ముస్లిముస్థానాలు చాలవరకు లీగుపక్షమునకే లభించెను. పక్షప్రాబల్యము, హంగు, ధనబలము, పరపతి

మసీదులలో ప్రమాణపద్ధతి; సాంఘికతత్వమును పనిచేసినవి. కొన్ని ప్రాంతాలలో ముస్లిముయెన్నికలలో దౌర్జన్యము లంచము, నిర్బంధము, బహిరంగముగా ప్రయోగింపబడెనని, అందుకు సర్కారు అధికారులు అడ్డలేదు, సరికదా లీగుజయ మునకే తోడ్పడిరని, చాల నిదర్శనములు దొరికినవి. ముఖ్య ముగా బెంగాలులోను, సింధులోను బహిరంగముగానే హింస, నిర్బంధములు జరిగెను. జాతీయముస్లిములు చెప్పు కుంటే వినేదిక్కు లేదు, సరికదా వారికి, వారియేజంట్లకుగూడ ప్రమాదములు,ఆపత్తులు సంభవించెను. అట్టిస్థితిలోలీగుపక్షమే బెంగాలులో ప్రబలమైనది. అక్కడను, సింధులోను,ఆంగ్లేయుల పక్షపాతమును ఉపయోగించుకొని, లీగుప్రభుత్వ మేర్పడెను. పంజాబులో ముస్లిముస్థానాలు చాలవరకు లీగుకు వచ్చినవి. కాని, మొత్తముమీద యూనియనిస్టులు, కాంగ్రెసువారు కలిసి పాలన మారంభించిరి. తక్కిన అన్ని రాష్ట్రాలలో 1946 ఏప్రిలునుండి కాంగ్రెసు మంత్రివర్గములు మరల నేర్పడినవి. సింధులో మరల యెన్నికలు జరిగెను; అందులో లీగువారు దౌర్జన్యనిర్బంధాదులను స్వేచ్ఛతో నుప యోగించిరట! వారి కక్కడ అధికారబలము హెచ్చినది. ఇటీవల పంజాబులో సాంఘికకలహములు పెరిగి, లీగుబత్తిడి వల్ల యూనియనిస్టు మంత్రివర్గము పడిపోయినది.

# 52. ప్రకృతి చికిత్సాలయం

ఈ జాతీయకార్యాల నిరంతరకృషిమధ్యనే గాంధిగారు 1945-46 లలో ప్రకృతిచికిత్సాలయమును స్థాపింపజేసిరి. ఆరోగ్యరక్షణ ప్రతివానికి ఆవశ్యకము అని గుర్తించి, ఆయన చరకాదిమునులు చెప్పిన ఆరోగ్యవిధులను (అనుభవముద్వారానే) సదా గమనించెను. ఇటీవల మన దేశ భాషలన్నిటిని, లిపులన్నిటినిగూడ ఆయన నేర్చుకొనుచుంటే, "ఈ వార్ధకములో, శుష్కశరీరముతో, ఈశ్రాంతింబవళ్ళ కృషి యేమి?" అనియెవరోఅడిగిరట. అందుకు "అదేమిమాట, నేను యువకుడను125యేండ్లుజీవించదలచినాను" అన్నారట. "అయితే మీదేహమును దృఢపర్చుకొని,ఈచికాకులనుండి విశ్రాంతితీసుకోండి" అనగా, "అబ్బే, 125యేండ్లు నాసుఖమునకా? దేశమాతకు, లోకమునకు ఇంకా నిరంతరముసేవజేయుటకే జీవింతును' అని జవాబిచ్చిరి. మనదేశమును ఆధ్యాత్మికముగా లోక ప్రసిద్ధముజేసిన మహాత్ములలో శంకర, రామతీర్థ, వివేకానందాదులు 40 ఏండ్లలోపు యువకదశలోనే పరమపద మొందిరి. కాని, మధ్వ,రామానుజ,రామకృష్ణాదులుదీర్ఘాయుష్కులయిరి. పూర్వపు వసిష్ఠవిశ్వామిత్రాదులు వందలకొలదివర్షములుజీవించిరట. తగు శైలవాయువు, సూర్యరశ్మి, గంగోదకము, వగైరాలతో తేజోవృద్ధి జేసుకొని ప్రకృతిజీవనులై సుదీర్ఘకాలము

జీవించిరి. 125 ఏండ్లు లోకసేవకై జీవింపజూచుట శ్రుతిచోదిత మని గాంధిగారి విశ్వాసము.

తరుచు వైద్యు లాయన దేహమును పరీక్షింతురు. కాని ఆయన ఔషధాలను (వైద్యులు చెప్పినను) తీసుకోడు. "అలోపతి"కన్న ఆయుర్వేదమే శ్రేయస్కరమైనను, ఇప్పటి ఆయుర్వేద వైద్యము సరియైనస్థితిలో లేదని ఆయనభావన. ఆయుర్వేదముకన్న ప్రకృతివైద్యమునే ఆయన యెక్కువ ఆదరించును. అజీర్ణజ్వరాదులకు, గాయములకునేగాక, ప్లేగు, విషూచి, మశూచివంటి అంటువ్యాధు'లకును ఆయన స్వయముగా ఆశ్రమములో చికిత్సజేసి నిర్వహించెను. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం". కనుక ప్రజాక్షేమమునకు మార్గదర్శకముగా ఆయన స్వయముగానే ఒక ప్రకృతి చికిత్సాలయమును స్థాపించదలచెను. కాని, తీరికలేదు. ఇటీవల పూనా సమీపములోని "ఉరులి కంచన్" అను గ్రామములో ఘనులగు అనుభవ వైద్యులద్వారా ఒక ప్రకృతి చికిత్సాయమును స్థాపింపజేసి, అందుకు విరాళములు రాబట్టెను! జబ్బును కుదుర్చుటకన్న జబ్బురాకుండ ఆరోగ్యము బాగుచేయుట, దేహ మనోహృదయాదుల సమన్వయించుట, ఆహార విహారాలను సరిచేయుట, ఇందు ముఖ్యములు. జలచికిత్సద్వారా దేహములోనిచెడుపదార్థమును తొలగించుట, ఆతపచికిత్స (అనగా సూర్యరశ్మిప్రసారం) ద్వారా ఉష్ణతను నాడీశక్తిని బలపర్చుట, ఉపవాస

జలపానములద్వారా అజీర్ణమును పోగొట్టుట, మట్టిపూత, లేత ఆకుల గప్పుటద్వారా గాయములు, చర్మవ్యాధులు రక్తపు పోటుబాధ, ఇత్యాదులు మాన్పించుట ఈచికిత్సాయలపు ముఖ్యపద్ధతులు. పంచభూతాత్మకమగు దేహము ఆభూమి, జల, తేజో, వాయ్వాదుల సవ్యప్రయోగమువల్లనే ఆరోగ్య మొందును. భక్తియు, ప్రపత్తి అనగా దేవునిపైన పూర్ణవిశ్వాసముతో ఆధారపడి దేవుని స్మరించుటయు వ్యాధినివారక మని పూర్వపు ఆయుర్వేదజ్ఞులును చెప్పిరి.

---

# 53. అమాత్య ప్రణాళిక

క్రిప్సు రాయబారమునలె వవెలు మంత్రాంగమును మాయామయమని, 'విభజించిపాలించు' పాతపంథానే నడచినది. ఈలోగా జర్మనీజపానులు పూర్తిగనోడి, మిత్రమండలికి విజయము చేకూరెను. కాని ఈయుద్ధాంతమున బ్రిటిషు సామ్రాజ్యప్రతిభ, ప్రతిష్ఠయు క్షీణించినవి. ఇక సామ్రాజ్యమును బలముతోను, పటాటోపముతోను అణచియుంచ వీలు లేదు. సామ్రాజ్యతత్వము మూర్తీభవించిన చర్చిలుగారి కెన్నికలలో శృంగభంగంచేసి యేర్పడిన కార్మికప్రభుత్వము

వారు ఇక్కడకు ముగ్గురు మంత్రులను రాయబారమంపిరి ఈమంత్రిత్రయము ఢిల్లీ, సిమ్లాలలో మరల నాయకులతో కొంత చర్చలు జరిపెను. 1946 సం. మార్చి నెలలో గాంధిగారి కేంద్రప్రభుత్వములో కాంగ్రెసు పక్షమువారిలో ముస్లిములు కూడ ఉండవలెనని షరతుపెట్టిరి. కాంగ్రెసులో ముస్లిములు లేకుండజేయుట జిన్నాగారి కోరిక. చివరకు మంత్రిత్రయ మింగ్లండుకు పోయి, తమ ప్రణాళికను ప్రచురించిరి.

'భారత కేంద్రప్రభుత్వము, రాష్ట్రకూటపు మండలి, రాష్ట్రప్రభుత్వము, ఇట్లు రాజ్యాంగాలలో మూడంచెలు పెట్టిరి. దేశరక్షణ, విదేశాంగశాఖ, రహదారీశాఖ, దేశమంతటికి సంబంధించిన యీమూడుశాఖలే భారతకేంద్ర ప్రభుత్వంవశమై యుండును, తక్కిన అన్నిపాలనశాఖలు ఆయారాష్ట్రాలవే. మరియు వాయవ్యసమితి, ఈశాన్యసమితి, శేషసమితి ఇట్లు మూడుగూ్రపులు (కూటాలు)గా ఆరాష్ట్రాలు గూడి, ఆసమితికి తమ అధికారాలను కొన్నిటిని వప్పగించవచ్చు. ఈ కూడలి పద్ధతికి మొదట ప్రతిరాష్ట్రమూసిద్ధముకావలె. కాని,కూడలిలో చేరి, కొత్త రాజ్యాంగప్రకారం యెన్నిక యయినతరువాత ఏ రాష్ట్రంవారయిన ఆసమితిలోనుండి విడిపోవచ్చు; ఈపద్ధతిని, సమగ్రరాజ్యాంగమును తయారుచేయుటకొకరాజ్యాంగపరిషత్తు ఉండును. రాష్ట్ర అసెంబ్లీలసభ్యులే (ముస్లిములు వేరుగను. తక్కినవారు వేరుగను) ఈపరిషత్తుకు జనాభానుబట్టి పదిలక్షల

కొకనిచొప్పున సభ్యుల నెన్నుకొందురు. అట్టి రాజ్యాంగపరిష త్తులోపాల్గొను పక్షాలనాయకులను ఇంటరిం(తత్కాల) జాతీయ ప్రభుత్వమంత్రులుగ నియమింతురు. ఈవిచిత్ర రాజ్యాంగము నకు మొదట సమ్మతించియు, తరువాత లీగువారు నిరాకరించిరి. ఏరాష్ట్రమైన గూ్రపింగు అనగా కూటంలో పాల్గొనుట ఐచ్ఛికము. ఆసిద్ధాంతమునకు భంగము లేకుండ దీని నంగీకరింప వచ్చు అని గాంధిగా రభిప్రాయపడిరి. (ముఖ్యంగా అస్సాం వారు తూర్పు గ్రూపులో చేర నొప్పుకోలేదు.) కాంగ్రెసు కార్యసంఘమువారు అట్లేతీర్మానించిరి. అంతటజవహర్లాలుగారి నాయకత్వమున కేంద్రమంత్రివర్గ మేర్పడినది. అందులో లీగు పక్షము చేరనన్నందున వారిస్థానే స్వతంత్రముస్లిములు చేర్చ బడిరి. ఈసమిష్టిమంత్రులు 15 గురిలో 6 మాత్రం కాంగ్రెసు పక్షీయులు, ఐనను ఈ అందరు కాబినెటువలె ఏకీభావము కల్గి స్వతంత్రజాతీయదృక్పథముతో ప్రభుత్వమున ప్రగతికర ముగా నడువదొడగిరి.

# 54. బ్రిటిషుసర్కారు కప్పదాటు

నెహ్రూప్రభుత్వపు జాతీయప్రవృత్తివైస్రాయివవెలుకు సివిలియనులకును గిట్టలేదు. మంత్రులలో విభేదాలేర్పడితేనే వైస్రాయి కేంద్రపాలనలో కల్పించుకోవచ్చు. కాని, మంత్రి

లందరు ఉపాధ్యక్షుడగు నెహ్రూనాయకత్వములో మైత్రితో ఏకధోరణి కలిగియుండిరి. గాంధిగారు ముఖ్యసమస్యలనగూర్చి వీరికందరికి సలహాలిచ్చిరి. అప్పటి ముస్లింమంత్రులున నెహ్రూతో ఏకీభవించిఉండుట బ్రిటిషుపాలకులకును, లీగుపక్షమునకునుకన్నెర్రగనుండెను. అప్పుడువైస్రాయి జిన్నానుతొందరగ ఆహ్వానించి మొదటిముస్లింమంత్రులను వదలించి, ఆస్థానే 5 ముస్లింలీగు పక్షీయులను మంత్రులుగ తగు నియమాలు లేకుండగనే చేర్చెను. వారు నెహ్రూపక్షముతో నేకీభవింతురు, ఇక లీగు ముస్లిములును రాజ్యాంగపరిషత్తులో పాల్గొందురు, కనుక ఈరీతిగ పేచీలేకుండ క్రొత్తరాజ్యాంగము త్వరలో ఏర్పడి బ్రిటిషుప్రభుత్వపు ఆమోదము నొందుననియు, వవెలుగారు నెహ్రూవర్గము నొప్పించిరి. కాని, క్రియలో లీగుపక్ష మంత్రులు బ్రిటిషు ఐ. సి. ఎస్. ముస్లిం ఉద్యోగులతో, వవెలుతో, లాలూచీపై జాతీయవర్గమున కష్టుతగులుచుండిరి. తమవశమందున్న శాఖలపరిపాలనలో వేరుపంథా తొక్కుచుండిరి. ఇంతేగాక రాజ్యాంగ పరిషత్తువారి సమావేశాలలో ముస్లింలీగువారు పాల్గొనక దేశమున దౌర్జన్య ప్రచారమును సాగించిరి.

---

# 55 అగ్నిపరీక్ష

స్వరాజ్యసంపాదనకు సాంఘికమైత్రి ముఖ్యావశ్యకము. అహింసాసాధకుల కది మరీముఖ్యము. అయితే బ్రిటిషువారి కొన్నిచర్యలవల్లవిదేశపాలకులీదేశమునువదలిపోతేగానిహిందూ ముస్లింమైత్రి గట్టిపడదని, విభేదాలు పెంచుటలో దిట్టలయిన బ్రిటిషువారిప్రవృత్తివల్ల గాంధిగారికిని తోచెను. లీగుపక్షీయులు రాజ్యాంగపరిషత్తును నిరసించుటేగాక, ప్రభుత్వము మీద ప్రత్యక్షయుద్ధమును 16-8-46 నుండి ఆరంభించినను, కేంద్రప్రభుత్వమునుండి లీగుమంత్రులను వైస్రాయి పంపివేయలేదు. ఆప్రత్యక్షచర్య లీగుపాలితమగు బెంగాలులో, ముందుగా కలకత్తాలో, పిమ్మట తూర్పు బెంగాలులో సాగింపబడెను. అయినను బ్రిటిషుఅధికారులు వారికి సహకారమే జేసిరి. లీగువారును తమ పోరునంతను హిందూ సిక్కులమీదనే సాగించిరి. శాంతమనుపేరుతో దారుణమగు హత్యాకాండ, బజారులో మహాభవనాలను భస్మముచేయుటయు, వేలకొలది జననష్టము, కోట్లకొలది రూపాయల ఆస్తినష్టము కండ్లయెదుటనే జరిగెను. ఆ ముస్లిముగూండాలకు లాఠీలు, పెట్రోలు, శూలాలు, బల్లెములు, బాకులు, తుపాకులుగూడ ధారాళముగా ఎట్లులభించెనో? హిందువులు మొరబెట్టినను గవర్నరు కల్పించుకోలేదు. కృతజ్ఞులగు ముస్లిం

గూండాలును యూరపియనులకు, వారి ఆస్తులకు యెట్టినష్టమూ చేయలేదు. మొదటి రెండురోజుల దారుణముల తరువాత హిందువులు, సిక్కులును ముస్లిములపైన హత్యలతో ప్రతిక్రియ జేసిరి. అప్పుడు సైనికులు సిద్ధమయిరి. అంతట ముస్లిం సంఖ్య చాల హెచ్చుగు తూర్పు బంగాళపు నవఖాలీ జిల్లాకు ముస్లిములు రంగమును మార్చిరి. ముస్లిముగూండాలు అక్కడ తమ ప్రత్యక్ష చర్యలను స్వేచ్ఛతో సాగించిరి వేలకొలది హరిజనులను దౌర్జన్యముతో ముస్లిము మతములో కలిపిరి. సవర్ణ హిందువులకు హత్యా, ఆస్తి నాశము లభించినవి. రక్షకులగు లీగు ప్రభుత్వమువారే భక్షకులైరని, హిందువులనేకులటనుండి కాందిశీకులయి పశ్చిమజిల్లాలలో చేరిరి; వారికొంపలను, పంటను కాపాడునదెవరు? సాంఘిక ద్వేషము లీగు ప్రేరకలచే ముందుగ ప్రచారితమై, కార్చిచ్చువలె దేశమంతటను వ్యాపించెను. ఖాండవవనాగ్నివలె హింసావృతమైన నవఖాలీ ప్రాంతములోనికి గొప్ప ఉద్యోగులు, హిందూనాయకులును వెళ్లలేకపోయిరి. సహజముగా వార్త లతిశయోక్తిగ వ్యాపించెను; పరిశీలన సాధ్యంకాలేదు. గాంధిగారి కిది జీవిత సమస్య. వెంటనే ఆయన నవఖాలీ వెళ్ళి అక్కడ స్వయముగా పరిశీలింప నిశ్చయించెను. నిరాయుధుడు, అసహాయుడునగు గాంధిగారట్లు ఆ అగ్నిమండలములోనికి దూకుట ఆత్మహత్య పాలగుటేనని అందరు భయపడి వద్దనిరి. కాని ఆయన సాహసించి నవఖాలీకి వెళ్లెను.

ఈలోగా, బెంగాలు కాందిశీకులనేకులు బీహారు చేరగా ఆవార్తలవల్ల ఉద్రిక్తులైన కొందరు బీహారు హిందువు లక్కడి ముస్లిములను హింసింపదొడగిరి. ఆమాట విని, ఆ హత్యాకాండ వెంటనే ఆగిపోనియెడల ఆమరణోపవాసము చేతునని కలకత్తానుండి గాంధిగారు తెల్పిరి. బీహారుమంత్రులు నెహ్రూ, ప్రసాదులుగూడ స్వయముగా పూనుకోగా ఆరంభించిన వారమునకే బీహారు అల్లరులు నిలిచిపోయినవి. నవఖాలీ, తిప్పెర జిల్లాలలో ముస్లిముగూండాలు హత్యలు, ఇండ్ల ధ్వంసమునేగాక, స్త్రీలనుచెరబెట్టుట, నిర్బంధముగా మతమును చెరపుట, ఆలయాలను తగులబెట్టుట, ఇట్టి రాక్షసచర్యలను చేసిరి. దారితెన్నులేని ఆగ్రామాలలో ప్రతిదానికి గాంధిగారు స్వయముగావెళ్ళి, ధైర్యముచెప్పి, ముస్లిముల యిండ్లలో బసచేసి, ఉభయులమధ్య మైత్రికి మానవసాధ్యమయిన కృషినంతను నెలలకొలదిగ చేసిరి. ఆగట్లమీాద, బురదలో, ఇసుకలో, ప్రాణము లరచేత బెట్టుకొని, కొద్దిమంది ఆయనతో వెళ్ళిరి. కాని తన పరివారమునుకూడ ఆయన వేర్వేరుగ్రామాలకు పంపి, అక్కడి లీగుముస్లిములు తనకు వ్యతిరిక్తులు, ఉద్రిక్తులునని తెలిసియు, ఆతతాయులతోగూడ చిరునవ్వుతోకలసి ఆదరింప, వారు నిశ్చేష్టులై శాంతులయిరి. ఇట్లు ఆ యాత్ర, గాలిలో దీపమువలె మొదట తోచినను, ఆత్మశక్తి, దైవబలమువల్ల తుదకు హిందూముస్లిములమధ్య తద్వారా కొంత

మైత్రియేర్పడెనని అందరు నంగీకరించిరి. స్థిరసఖ్యమునకై ఆయన కొంత ప్రక్రియను మంత్రివర్గమునకు సూచించెను. మీరటులో జరిగిన అఖిలభారత కాంగ్రెసునకును ఢిల్లీలోని ముఖ్యరాజకీయసమావేశాలకును (వేడినను) వెళ్ళక ఆ ప్రచండహింసాగ్ని నార్పి ప్రేమామృతముతో ఆవిషపూరిత మైన వాతావరణమును మార్పగలిగెను. అప్పుడు బీహారులో ముస్లిములకు మరల స్థిరావాసము కల్గింప, అక్కడిమంత్రి డా. సయ్యదు మహమ్మదుగారు కోరగా గాంధిగారు బీహారు రాష్ట్రమునకువిచ్చేసిరి. అక్కడి దౌర్జన్యాలు వారంరోజులలోనే (గాంధి, నెహ్రూ ప్రభృతులందున్న గౌరవమున) అణగిపోయి నను, వేలకొలది ముస్లిములకు ఆస్తిప్రాణనష్టములు కలిగినవి. కనుక మిగతాముస్లిములు కాందిశీకులై కొందరు స్వగ్రామాలను విడచి పాట్నాప్రాంతమునకుచేరిరి. అక్కడి కాంగ్రెస్ ప్రభుత్వము కొంత సహాయము చేసినను, వారి భయోద్రేకము పోలేదు. అప్పుడు సరిహద్దురాష్ట్రమునుండి గఫూర్ ఖానుగారు వచ్చికొంత తోడ్పడిరి. ఈ 1947 లో గాంధిగారు బీహారుముస్లిములతో కలిసి గ్రామాలు పరిశీలించి, ప్రభుత్వపురక్షణయేర్పాట్లను తృప్తికరముగా జరిగించి, ఆహిందువులకు పశ్చాత్తాపమును, ముస్లిములకు ధైర్యమును కలిగించి, వారిగ్రామాలలో మరల వసించి నమ్మకతో తమ వృత్తులు చేసుకొనునట్లు సౌకర్యాలు కలిగించిరి. కలకత్తా

నవఖాలీలకు ప్రతిక్రియగనే బీహారు అల్లరులను హిందువులు జరిపిరని, అట్లుచేసినందుననే ముస్లిముల గూండాచర్య లణగిన వని, కనుక ఆహిందువులను అంతతీవ్రముగా గాంధిగారు నిర సించుట. అన్యాయమని కొందరు హిందూప్రముఖులు తప్పు పట్టిరి; కాని గాంధిగారు ఆవాదము భ్రమజనితమని, ఇట్టిప్రతి క్రియనుజూచి మరల పంజాబులో ముస్లిములు హిందు వులు, సిక్కులమీద జరిపిన హింసను జూపి ఈ మారణ హోమము మహానర్థదాయకమని స్పష్టపరచిరి. గాంధిగారి అద్భుతకృషియే అక్కడిశాంతికి, తగాదాలు ఆప్రక్క జిల్లాలకు వ్యాపించకుండుటకును కారణము. అహింసాప్రేమ పద్ధతివల్లనే స్థిరమైత్రియు, శాంతియు కలుగునని గాంధిగారు విశదపర్చిరి.

# 56 ఆసియా మహాసభ

యూరపియనుల వశమునుండి బయటపడు ఆసియావాసి దేశములోనే 1946 సం॥ మార్చిలో ఒక ప్రతినిధిసభను జేసిరి. శ్వేతజాతులనుండి ఆసియాజాతుల రక్షణకు గాంధిగారు కృషి చేయుమాట అందరికీ తెలిసినదే. ప్రాంతీయతత్వము, కుల తత్వము, సాంఘికతత్వము, మతమూర్ఖత, జాతిద్వేషము లేకుండ, సర్వసమత్వముతోనే అన్నిజాతులు వృద్ధికావలెనని

ఆయన కోరును. విదేశీయులమీద ఆయన కెట్టి ద్వేషమును లేదు. అసలు నాజీఫాసిస్టుపద్ధతులు జాతిద్వేషహింసా తత్వము లపై నేర్పడినవి. వాటి నాయన చాలసార్లు ఖండించెను. హింసాదౌర్జన్యముల నవలంబించుట తుదకు లోకమంతకు హానికరము. స్వజాతివృద్ధికిని బాధాకరమే, కనుక యుద్ధసంరంభమును మానుమని జర్మనునియంత హిట్లరుకు, జపానునియంత టోజోకు గూడ ఆయన బహిరంగ లేఖలు వ్రాసెను. అపారబలము గల అమెరికా ఒకపక్షముననే జయమునుచేకూర్చి స్వలాభపరమగుటకన్న, సంపూర్ణముగా యుద్ధము నణచివేయుటకు మధ్యవర్తియై, రెండుపక్షాలకు సఖ్యము కల్పింపబూనవలెనని, చిత్తశుద్ధితోను, స్వార్థదృష్టి లేకుండను, అమెరికా అట్టి యత్నము చేస్తే, అన్నిపక్షాలు రాజీకివత్తురని, అందువలన నిజమయిన లోకశాంతి యేర్పడు నని, ప్రపంచజనులు సుఖింతురనియు ఆయన అమెరికాను గూడ ఉద్బోధించెను. అందుకు ఆంగ్ల అమెరికను నాయకు లందరు అపార్థముచేసికొని ఆయనను దూషించిరి. ఆయన జపాను అభిమాని అని కొందరు ప్రముఖులు అపవాదువేసిరి. కాని, ఇట్టి ఆగ్రహానుగ్రహాలవలన ఆయన భావాలు మారలేదు. "ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకం" గదా! ఆయనకు అన్నిజాతులు ఒకటే. కీ. శే. వెండెల్ విల్కీ అను అమెరికను ప్రముఖుడు అన్నట్లు ప్రపంచమంతయు ఒకే

మానవజాతి; వారందరూ మైత్రి కలిగియుండుటే లోకమునకు క్షేమకరము. ఈయుద్ధజయమువల్ల లోకమునకు శాంతి రాలేదు. ద్వేషము, కలహాలు రేగుచున్నవి. రష్యాపైన అమెరికనులు కాలుదువ్వాచు, అటంబాంబులతో సోవియటురష్యాను బెదరించుచు, ఆంగ్ల ఫ్రెంచి పశ్చిమజర్మనీలపయిన ప్రాభవమును హెచ్చించుకొనుచున్నారు. శ్వేతజాతీయులు ఇతరులపయిన ప్రాబల్యము పెంచుకొనుటకు ఆంగ్ల అమెరికనులు తోడ్పడుచున్నారు. పింగళజాతి (జపాను, చీనా) పయిన అమెరికా ఉచ్చు బిగించుచున్నది. ఈజిప్టు, పాలెస్టీను, టర్కీ, ఇరాకు; ఇరానులపయిన అమెరికనులు (ఆంగ్లేయుల సహాయముతో) తమ ప్రాబల్యమును హెచ్చించుకొనుచున్నారు. తూర్పున ఇండోచీనా, ఇండోనీషియా, మలయాలలోను ఫ్రెంచి, డచ్చి, బ్రిటిషువారు తమ ఆధిపత్యములను బలపర్చుకొనుచు, ఆదేశీయుల నణచుచున్నారు. ఈస్థితిలో ఈ శ్వేతేతరజాతుల మహాసభ దక్షిణాసియాకు కేంద్రమగు భారతదేశములోనే 1947 లో శ్రీమతి సరోజిని నాయుడు అధ్యక్షతను ఢిల్లీలో జరిగినది. ఈ ఆసియాజాతులన్నిటి సంస్కృతి మనదేశపు పునాదిపయిన ఒకే తత్వముతో వృద్ధియైనది. ఈజాతులు చాలాకాలము సహకారముతో మెలగినవి. శ్వేతజాతివారి జబర్దస్తీదాడినుండి ఆత్మరక్షణయు వరికందరికి కావలెను. మనదేశమునుండి పిలుపు రాగనే టర్కీ

నుండి, ఆసియాలోని (పరాధీనమగు జపానుతప్ప) అన్ని దేశాల నుండి ప్రతినిధులందరు వచ్చి పరమానందముతో సమావేశమున పాల్గొని, పరస్పర ప్రేమతో మెలగి, తమ సమస్యలను అనుకూలముగా చర్చించుకొన్నారు. ఈసభ నలంకరించి గాంధి మహాత్ముడు సందేశమివ్వవలెనని ఆప్రతినిధులు కోరిరి. గాంధిగా రప్పుడు బీహారులో హిందూముస్లిముసమాఖ్యలో మగ్నులై రాలేమనిరి. నెహ్రూగారు ఆసభ్యులందరి తరఫున మరల వారి నాహ్వానించిరి. అప్పుడే కొత్తవై స్రాయి మౌంటు బాటనుగారుగూడ తక్షణం రమ్మని గాంధిగారికి కబురుపంపిరి. అందువలన గాంధిగారు ఢిల్లీచేరి సభాంతములోగా ఒకరోజు ఆసియనుసమావేశములో పాల్గొనిరి. సదస్యు లందరు ఆయన రాగనే లేచి సన్మానించిరి. ఇందులో ముస్లిములీగు తప్ప తక్కిన మనదేశంలోని పక్షాలన్నియు పాల్గొన్నవి. అన్యదేశాల ప్రతినిధులలో చాల హెచ్చుమంది మహమ్మదీయులే. కనుక, సభలో ఎక్కువమంద ముస్లిములే. ఆసమావేశమున గాంధిగారిట్లు ప్రసంగించిరి;—

"ఈభారతీయుల సంస్కృతి, దానితో సన్నిహితసంపర్కముగల మీఅందరి సంస్కృతియు, అహింసాసత్యబీజములనుండి మొలకరించి, శాంతితో చిగిర్చి, ప్రేమతత్వముతో పెరిగినది. మన పూర్వసాంగత్యమును స్మరించి, మరలఅందరు కలియుట శుభావహము. మన అందరి సహకారముతో ఆసి

యావాసుల ఐకమత్యము దృఢపడుగాక. యూరపుసామ్రాజ్యమునుండి ఈ యుద్ధాంతమందు మనము బయటపడుచున్నాము; వారిప్రాబల్యము తగ్గి, మనకందరికి భౌతికోన్నతితోబాటు ఆధ్యాత్మికోన్నతియు కలుగుగాక. యూరపుఅమెరికాలు తమ ఆధిపత్యమునకై చేయువిజృంభణను మనమరికట్టుదుము. వారిపయిన మనకు విరోధములేదు. పాశ్చాత్త్యులపయిన, శ్వేతజాతులపయిన, ద్వేషముతోకాక; లోకమంతటి అన్యోన్యతకొరకు మరలయుద్ధాలు, యుద్ధకారణాలు కలుగకుండప్రపంచమంతయు స్నేహముతో ఉండవలెనని మనకోరిక. మనమైత్రి విశ్వజనీనతలో అంతర్భాగమే; కనుక శ్వేతజాతులు కలవరపడనక్కరలేదు. యుద్ధాగ్ని చల్లారినను, తచ్ఛేషముగా ద్వేషాలు మిగిలియున్నవి. మా దేశములోను సాంఘికవిరోధాలు, రక్తపాతాలు యిప్పుడు సాగుట మాకు లజ్జాకరము. ఐతే అట్టి తాత్కాలికమగు దృశ్యమును మరచి, స్థిరమగు అహింసా సఖ్యభావాలనే ఈదేశమునుండి స్వదేశాలకు గొంపోదురని నాకోరిక"

ఆమాటలను అమృతసందేశముగ నందుకొని సంతుష్టులై ప్రతినిధులు ఆనందముతో మైత్రీతీర్మానాలు చేసికొనిరి.

---

# 57 సేవాగ్రామం

1930లో సబర్మతీ ఆశ్రమ మెత్తివేసి, సత్యాగ్రహాదులు చేసి గ్రామపునర్నిర్మాణకార్యమునకై ఆయన యేదో గ్రామములో వసింపదలచిరి. మనదేశపు నాభిఅనదగిన వర్ధా నగరమునకు నాలుగైదుమైళ్ళలో నున్న సేవాగ్రామ మాయనకు నచ్చెను. అప్పటి కిది హరిజనులుండు చిన్నపల్లె. వారి కారోగ్యాదులునేర్పి ఆయన వారిని బాగుచేసిరి. వర్ధాలో కొంత భాగము సేవాగ్రామముసహా గాంధిగారిప్రియశిష్యుడగు బజాజు గారిది. ఇక గ్రామజనుల ఆరోగ్యము, యుక్తాహారము, కుటీర పరిశ్రమలు, ఇత్యాదులవృద్ధికే ఆయన తనజీవితమును వినియోగించదలచిరి. కనుకనే అది తగువసతులు లేని ఉష్ణస్థలమైనను అక్కడనే ప్రశాంతస్థితిలో వసింపుచు, గ్రామసేవకవసరమగు సంస్థలను దేశమంతటి ఉపయోగమునిమిత్తము మార్గదర్శకముగా ఆచుట్టుపట్లనే నిర్మింపజేసి, సానుభూతిగల సమర్థుల నిర్వాహణలో ఆసంస్థల సాగించుచున్నారు. అందులో యీక్రింద జెప్పినవి ముఖ్యముగా పేర్కొనదగినవి.

మొదటిది—సేవాగ్రామంలోని అ॥ భా॥ చరఖాసంఘము; దానికి మొదట శ్రీ శంకరలాల్ బాంకరు, పిమ్మట శ్రీకృష్ణదాసజాజు,(యిప్పుడుకృష్ణదాసగాంధియు)కార్యదర్శులు. దేశమందన్నిప్రాంతీయశాఖలకిది కేంద్రము. ఇందులో పడు

తీుట, ప త్తిగింజలు తీయుట, రకరకములనేత, వడ్రంగం, యిట్టి వాటినిగూర్చి పరిశోధనలు జరుగును. ఇదిగాక ఖాదీశాస్త్ర మంతను నేర్పుట కొక మహావిద్యాలయమును సాగింపబడును. తక్లీలు, రాటములు, యిత్యాదులు తయారుచేయబడును.

ఇక్కడ నవ్యవిద్యావిధాన పాఠశాలయు శ్రీ ఆర్య నాయకం, ఆశాదేవిగార్ల నిర్వాహణలో నడుపబడుచున్నది. పిల్లలకు వల్లింపు, మనశ్శ్రమ లేకుండ చేతిపరిశ్రమతో సమన్వయించి, గ్రామావసరముల కుపయోగించు విద్యను, హిందూస్తానీని, జాతీయతను, వ్యవసాయవృద్ధినిగూడ ఇక్కడ నేర్పుదురు. యిక్కడ వైద్యచికిత్సచేయు నవ్యరీతి చికిత్సాలయ మును నున్నది.

ఇందుకును, అతిధులబసకును, ఆశ్రమవాసులకును కట్ట బడిన కుటీరములు అన్నికలసి ఒకప్రత్యేక గ్రామమయినది. ఇవిచక్కని వెలుతురు, గాలిప్రసారముతో విశాలముగా, కుది మట్టముగా, వాసయోగ్యముగా, చాలచౌకగా గ్రామపరికరాల తోనే కట్టబడి బహుసౌమ్యముగ నుండును. ఇట్టి కుటీరము లోనే నేలపైనుండి గాంధిమహాత్ముడు సేవాగ్రామంలో నున్న ప్పుడు నాయకులతో, విదేశప్రముఖులతో భాషించుచు, అమూల్యవ్యాసముల వ్రాయుచు, శ్రమించు చుండును.

వ్యవసాయప్రధాన మగు మనదేశములో గోపోషణ చాల ముఖ్యమయినది. గోసంపత్తువల్లనే జనుల ఆరోగ్యమును

రక్షితమగును. కనుక, ఒకగోరక్షణాలయము నిర్మింపబడి అందులో గోవుల పోషణ, చికిత్సవగైరాలు జరిగించబడుచున్నవి. ఇదిసేవాగ్రామమునకు, వర్ధాకుగూడ అందుబాటులో నున్నది. ఇక్కడమంచిపరిశోధనతో గ్రామస్థులకై చక్కని ఆకుకూరలు వగయిరాలు పండింపబడును. అ॥ భా॥ గ్రామపరిశ్రమలసంఘము వర్ధాలో శ్రీ జె. సి. కుమారప్పగారి నిర్వాహణలో విశాలస్థలమందు పనిచేయు మహాసంస్థ. ఇందులో రకరకముల చేతికాకితం, పొట్టుతో గోధుమ బిస్కట్లు, జొన్న వగయిరాల మాల్టు, దంపుడుబియ్యపు తిరగళ్ళు, తేనెటీగల బెంచి తేనెపట్టుట, నూనెగానుగల కృషి, మున్నగుచేతిపరిశ్రమల జేయుటేగాక, అందులో విద్యార్థులకు తరిఫీయతు యివ్వబడును.

వర్ధాలోనే స్త్రీల యభివృద్ధి నిమిత్తము గొప్ప మహిళా విద్యాలయము నడుపబడుచు, అందులో స్త్రీల యున్నతి కుపయుక్తమగు శిక్షణమీయబడి, దేశసేవికలకు శిక్షణము, సహాయము చేయబడును. వర్ధాలోనే హిందీని సామాన్య భాషగ వ్యాపింపజేయుటకు రాష్ట్రభాషాప్రచార కార్యాలయము స్థాపింపబడినది. దాని సంచాలకులు భాషాశైలి, ఉర్దూలిపి వాడుకనుగూర్చి గాంధిగారితో భేదించగా, హిందుస్తానీ ప్రచారసభ అనుపేర వేరే సంఘమును శ్రీ కాకా కాలేల్కరుగారి నిర్వాహణములో గాంధిగారు స్థాపించిరి. ఇది హిందూస్తానీ

పరీక్షలనునడుపుచు, ఉత్తరమధ్యదేశములలోని అహిందీ ప్రాంతాలలో హిందూస్తానీని జాతీయభాషగ ప్రచారము చేయును. ఇట్లే యిట్టి సాహిత్యమును జాతీయకృషితో వృద్ధిచేయుటకు హిందూస్తానీ తాలిమీ సంఘమునను ఏర్పడి పనిచేయుచున్నది. గాంధిగారి సిద్ధాంతప్రకారము ఆర్థిక సమత్వపద్ధతిని, ఆర్థిక వ్యాపారపద్ధతులను, వాటి సూత్రములను, బోధించుటకు వర్ధాలోనే వ్యాపార కళాశాల శ్రీమన్నారాయణ అగ్రవాల్ గారి అధ్యక్షతను చక్కగ నడుపబడుచున్నది. ఈ అగ్రవాల్ గాంధి సిద్ధాంతప్రకారము జాతీయమయి, బీదలకుపకారకమగు ఆర్థికప్రణాళికను తయారుచేసినారు.

ఇట్లే వర్ధాకు సమీపములోనే కుష్ఠరోగపీడితుల కొరకు చికిత్సాలయము శ్రీ వినోబాభావేగారి నిర్వాహణలో చక్కని పద్ధతులతో సాగింపబడుచున్నది.

ఈ ఆశ్రమంలో సామాన్యంగా వసించు గాంధిమహాత్ముని పరివారమునుగూర్చి ఒకమాట. ఆయా సంస్థల నడుపు ప్రవీణులు, శిల్పులు, విద్యార్థులునేగాక, గాంధిగారి మహాత్వముచే నాకర్షితులుచు కొందరాశ్రమవాసులు కలరు.

“సేవాగ్రామము” పేరుతోబాటు కీ. శే. కస్తూరిబా గాంధి, మహాదేవ దేశాయిగారి కుటీరములు జ్ఞప్తికి వచ్చును. ప్రస్తుతకార్యదర్శి ప్యారీలాలు పంజాబీ. ఈయన సోదరి సుశీలా నయ్యర్ డాక్టరు. ఆమె గాంధిగారి బిడ్డగ,సహాయకార్యదర్శినిగ

కూడనుండును. గాంధిగారి హిందూస్తానీ ఉపన్యాసాలను ప్యారీలాలుఉర్దూలిపిలో కుడినుండి ఎడమవైపునకు, డా॥ సుశీల నాగరిలిపిలో ఎడమనుండి కుడివైపునకును, (ప్రసంగసమయమందే) వ్రాయుచుండుట చోద్యముగ నుండును. గాంధిగారి మనుమడు కనూగాంధియు నిర్మాణకార్యాలలో పాల్గొనుచు, మహాత్మునికి తోడ్పడుచుండును. ఆచార్య భంసాలీఅను గొప్ప ఆంగ్ల విద్వాంసుడు, (మహారాష్ట్రుడు) గుజరాతు విద్యాపీఠములో బోధకుడై, పిమ్మట హిమాలయాలలో కేవలము పర్ణభక్షకుడై దిగంబరిగ చాలయేండ్లు తిరిగి, చిమూరులో సర్కారు సైనికులు స్త్రీల నన్యాయముగా బాధించి దౌర్జన్యము చేసినందుకు నిరసనగా 50 రోజులు దీర్ఘోపవాసము చేసిన మహర్షి. కేవలము పాలే తాగుచు, నిరంతరము నూలు వడకుచు, ఈ యాశ్రమములో నుండును. ఇంగ్లీషు నౌకాసేనాని కుమార్తె 'మీరాబెను' గాంధి శిష్యురాలై, సన్యాసి రూపముతో ప్రజాసేవ చేయును. ఇట్లే రాజకుమారి అమృతకౌరు తన జమీని, సర్వమును వదలి గాంధీయనిర్మాణకార్యాలలో మగ్నురాలై యుండును. ఇంక ననేకులు తరచు యిక్కడ దీర్ఘకాలముందురు.

# 58 జీవిత పద్ధతి

గాంధీమహాత్ముని దినచర్య లోకోత్తరమయినది. అర్ధరాత్రిగూడ పనిచేసినను, నిద్రించి బ్రాహ్మముహూర్తములో (ఉదయము 4 గంటలకు) లేచి, కాలకృత్యాలను తీర్చుకొని, ముందుగ గీతాశ్లోకాదులను పరివారముతో కలిసి చదివి ప్రార్థనచేయును. అంతట కొంచెము పండ్లు, మేకపాలును తీసికొని సూర్యోదయంవేళ గంటసేపు ఊరిబయట నడచును. ఈ నిర్మల ప్రభాతంలో దూరస్థలంవారును ఆయనతో నడచుచు సంప్రతింతురు. తరువాత కొంతసేపు తప్పక సూత్రయజ్ఞము జరుగును. ఆయన తప్పక నూలు వడకును. ఆపిమ్మట కార్యదర్శులు తెచ్చిన ఉత్తరాలను చదివి, అందులో ముఖ్యమయిన వాటికి జవాబులు వ్రాయును. అంతట తనకై వేచియున్న కాంగ్రెసు ప్రముఖులు మున్నగువారితో ఆయాసమస్యలను చర్చించును. స్నానము చేయును. మధ్యాహ్న భోజనము పొట్టుతీయని చిన్ని గోధుమరొట్టె, వేరుశనగ మున్నగు పచ్చిపప్పు, కారము పులుసు లేని ఉడికించిన కూరగాయల ముక్కలు, పండ్లు, పాలు లేక పెరుగు మాత్రము ఆయన భుజించును. ఈ యాహారము మితముగా (ఆకలి తీరునంత మాత్రమే) సాత్వికముగా నుండును. అంతట తన హరిజన పత్రికకు వ్యాసాలువ్రాయుట, ఆశ్రమములోని ఆయా కార్యకర్తలతో చర్చ, కావ్యపరిశీలన, రోగులకు చికిత్సచేయుట

నాయకులతో సంప్రతింపులు జరుగునప్పటికి సాయంకాల మగును. (మధ్యాహ్నవేళ ఒకప్పుడు కొంచెముసేపు విశ్రమింతురు.) అస్తమయమునకు పూర్వమే, సాయంభోజనము (మధ్యాహ్నమువలె)చేసుకొని, బహిరంగస్థలములో జనసమూహం మధ్య ఈశ్వర ప్రార్థన జరిగించి యేదేనొక జనహితకరమయిన విషయమునుగూర్చి ఉపన్యసింతురు; ఆపిమ్మట బయట కాలినడకను తిరిగి, రాత్రి కొంతసేపు మిత్రులతో, కార్యకర్తలతో సంభాషింతురు. కొంతసేపు చదువుట, వ్రాయుటయు కలదు. సాధారణముగా రాత్రి 10 గంటల తరువాత నిద్రింతురు. ప్రతిసోమవారం మౌనమవలంబింతురు.

ఆయన జాతీయకార్యాలకై వివిధప్రాంతాలలో తరుచు ప్రయాణములు సాగించవలె అప్పుడును వీలయినంతవరకు పై పద్ధతినే అవలంబించును. కాని, ఈయాత్రలలో వేలకొలది జనులు బృందముగా ఆయనను దర్శింపవత్తురు. ఆయాప్రాంతాలప్రముఖులు, వివిధరంగాల కార్యకర్తలు, అక్కడి పరిస్థితులను తెలిపి, ఆయన యుపదేశమును కోరుదురు. తరుచు కిషసమస్యలు నిర్మాణకార్యపు ముఖ్యాంశములగూర్చి ఆయన ప్రత్యేకశ్రద్ధ తీసుకొనును. బెంగాలీ, ఒఢ్ర, తమిళ, బ్రాహ్మణ, శూద్ర, క్రైస్తవ, పార్సీ, యువక, వృద్ధ, కాంగ్రెసు, మితవాది, సోషలిస్టు, ఇట్టిభేదాలు లేకుండ అందరూ ఆయనసలహానపేక్షింతురు. ఆయన నిజముగా సర్వమిత్రుడు. ఈదేశమునకు

వచ్చు ప్రముఖ విదేశీయులు ఆయనను తప్పక దర్శింప గోరుదురు. ఖండాంతరీయులును ఎందరో ఆయా సమస్యలనుగూర్చి ఉత్తరాలద్వారాను సంప్రతింతురు. ఆయన శాంతచిత్తుడై అందరికిని తగు సలహాలిచ్చి పంపును. తన ప్రతికార్యమును నిమిషమయిన భేదములేకుండ సకాలములో నిర్వర్తించుచు, కాలమేమియు వ్యర్థముచేయక చురుకుగ తేల్చుకొనును. కనుక యెంతటికార్యక్రమమైనను భారముగా తోచక అనాయాసముగా చేసివేయగలడు.

# 59 ఖాదీ

ఇప్పుడు నిర్మాణ కార్యక్రమంలోని కొన్ని ముఖ్యాంశములనుగూర్చి గాంధిగారి ప్రవృత్తిని గ్రహింతము. ఖాదీని అనగా వడుకు నూలుబట్టనే ప్రతివారు ధరింపవలెనని ఆయన 25 యేండ్లపైనుండి ప్రచారము చేసినారు. కాంగ్రెసు కార్యవర్గంవారు కాంగ్రెసుప్రతినిధులు కేవలము ఖాదీధారులు కావలె. కనుక అది మన స్వాతంత్ర్యవేష చిహ్నము. ఆయన పరివారమునసందరు ఖాదీనే ధరించి, నూలు వడకుదురు. ఆయన ప్రతిరోజూ ముఖ్యముగా ఉదయాసాయంవేళలందు నూలు వడకును.

జాతీయవాదులలోనయిన ఖాదీయందు పూర్ణవిశ్వాసము లేదు. మనదేశములో మిల్లులు పెరుగుచున్నను గాంధిగారికి ఖాదీవిశ్వాస మెంతమాత్రము తగ్గలేదు. ఆర్థికముగా లక్షలజనులకు అది పోషకము.

ఖాదీ అహింసాసత్యముల ప్రతీకము. మిల్లుబట్టకట్టితే పూర్ణస్వదేశీ సిద్ధించదు. ఖాదీ స్వదేశీయని చూచుటతోడనే మూఢుడుగూడ తెలిసికొనగలడు. మిల్లుల ప్రోత్సాహమువలన కొద్దిమందిలక్షాధికారులగుమిల్లుదార్లకు,అందుకుదిగుమతియగు లోహయంత్రాల నిర్మాతలకు లాభము కలుగును. మిల్లుపని వాండ్రు కిక్కిరిసిననగరప్రాంతాలలో యిరుకుకొని అవినీతిజీవనము చేయుదురు. ఖాదీ కిచ్చుసొమ్ము కొంచె మెక్కువయినన్ను గ్రామాభివృద్ధికి వినియోగపడును. వికేంద్రీకరణము జరుగును. ప్రత్తిని, రాటాలను, ఖాదీని గ్రామాలలోనే ఉత్పత్తి చేయవచ్చును. పెద్ద పరిశ్రమలను యుద్ధకాలములో శత్రువులు వశపరచుకోవచ్చు. ఈ ఆటంబాంబు యుగములో వికేంద్రీకరణమే ప్రశస్తము. మంచిరాటముల ఉత్పత్తికై గాంధిగారు పరిశోధనచేయించి, చరఖాసంఘముద్వారా ఖాదీ వ్యాప్తికి, వృద్ధికి చాల శ్రమపడినారు. సాధారణముగా యేజిల్లాఖాదీ అక్కడనే ఖర్చుచేయవచ్చు. నైతికంగా ఖాదీ వృద్ధి కావలెనని గాంధిగారికోరిక. ప్రతిగ్రామములో గృహస్థులు మంచిప్రత్తిపండించి, యింట నూలు వడుకవలెనని

వడుకువారు ఖాదీనే ధరించవలెనని ఆయన నిర్ణయించి, చర్ఖా సంఘపు నిబంధనలనట్లు మార్పించినారు. "ఖాదీజగత్" అను హిందీమాసపత్రిక కాయన తరచు వ్రాయుచుండును. వడుకు, నేయువారి కిచ్చుకూలి, జీవనమునకు చాలవలె. మన రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వమువారు ఖాదీ అభివృద్ధికై గొప్ప ప్రణాళిక నేర్పర్చి అమలు చేయుచున్నారు. కొన్ని విద్యాలయాలలో శిక్షణ నిచ్చి చాలచోట్ల ఖాదీయుత్పత్తిని వృద్ధిచేయుచున్నారు.

# 60 గృ హ ప రి శ్ర మ లు

ప్రస్తుతము నిరుద్యోగులుగ నున్న కోట్లకొలది గ్రామ జనులకు ఖాదీవలె, గ్రామపరిశ్రమలు గ్రామాభివృద్ధికి తోడ్ప డును. మరబియ్యము, ఫ్యాక్టరీపంచదార వచ్చినతరువాత లక్షలకొలది దంపువారికి, బెల్లముచేయువారికి వృత్తులు పోయి నవి. మరియు, ఇవి చాల అనారోగ్యమిచ్చునవి, కనుక, దంపుడు బియ్యమే అందరు వాడవలెను. కఱ్ఱ నాటు తిరగ ళ్ళలో విసరినబియ్యముగూడ దంపుడుబియ్యమువంటివే. దంపు డుబియ్యమును ముందుగా నానబెట్టితే అన్నము సళువై మెత్తగ నుండును. తక్కువ అన్నమే ఎక్కువ జీవశక్తినిచ్చును. ఇట్లే చెరుకుసాగు ఉన్నచోట్ల బెల్లముఉపపరిశ్రమయై ఆరోగ్యమును

వృద్ధిచేయును. గ్రామాలలోని గడ్డిపేలికలు, ఎండు వరిగడ్డి చెరుకుపిప్పి, వెదురు, వగయిరాలను పొడిచేసి, వాటిముద్దనుండి కుటీరాలలోనే గట్టి కాగితమును చేయవచ్చును. ఇందుకొన్ని జాతుల నీటిమొక్కలు, గడ్డిరకములు నుపయోగించును మున్ముందు కాగితపుగిరాకి హెచ్చుగ నుండును. ఉత్పత్తి ఎక్కువకాగా గిరాకీతగ్గును. ఇట్లే కంపెనీచెప్పులకు బదులు తోళ్ళపరిశ్రమను బాగుచేసి, ఆనాటు చెప్పులనే అందరు వాడవలెను. ఇట్లు నాటు గుండీలు, నాటువడ్రంగులుచేయు కర్ర సామానులు, నాటుచాకులు, చేతితో చేసినపొట్టుగోధుమ, జొన్న వగయిరాల బిస్కట్లు, తేనెటీగలనుపెంచి తేనెచేయు పరిశ్రమ, చేతితో వడికి నేయు పట్టుపరిశ్రమ, పట్టుపురుగుల బెంచుట, నాటు గానుగులతోనే నూనెలుతయారుచేయుట, చేతితో సబ్బుబిళ్ళలు, అగ్గిపెట్టెలు వగయిరాలు చేయుట, యిట్టి కుటీర పరిశ్రమలను వృద్ధిచేయుమని గాంధిగారు ప్రచారంచేసినారు వర్ధాలో జె. సి. కుమారప్పగారి నాయకత్వమున అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘము పనిచేయుచున్నది.

# 61 ఆర్థిక సమత్వము

పూంజీపతులకు, బీదవారికి మధ్యనున్న విపరీతపు అంతరము బ్రిటిషు పరిపాలనలో పెరిగిపోయినది. మిల్లుదార్లకు, కూలీలకు ఆర్థిక సంఘర్షణము లన్నిచోట్లను పెరిగినవి. ఇందు ఒక వర్గము నింకొకవర్గము అణచివేయ కృషిచేయుటవలన వర్గకలహాములు, సమ్మెలు, పోట్లాటలు, హింసాపరత్వము హెచ్చిపోవుచున్నవి. ఇవి నగరాలలో హెచ్చు. ఖాదీ గ్రామపరిశ్రమలు వగయిరాలద్వారా గ్రామాల పూర్వోన్నతిని బలపర్చి, సంఘర్షణకారణాలు త్యజించవలె. సంస్థానాలలోను ప్రజామండలులు, రాజులు అన్యోన్యతతో వర్తించవలె. ప్రజాసమ్మతితోనే రాజు పాలించవలె. జమీందారీలను తొలగించినను, జమీందారులకు ప్రజాప్రభుత్వము న్యాయమైన ప్రతిఫలమీయవలె; ఫ్యాక్టరీ యజమానులు తమలాభాలలో వాటాలను గుమాస్తాలకు, పనివాండ్రకుగూడ బోనసుగ పంచిపెట్టవలె. ఇట్టిపద్ధతులు గాంధిగారు ధనికవర్గమునకంతకు బోధించినారు. ఆయన బీదలపాలిటి పెన్నిధి ఐనను ఆయన సహజ సౌజన్యము, మిత్రభావము, దాక్షిణ్యమువలన ఎందరో మిల్లు యజమానులు, రాజులు, జమీందార్లు, వ్యాపారస్తులు, భూస్వాములు, పూంజీపతులు ఆయనతో చర్చించి ఆసిద్ధాంతాలను మన్నించి వీలయినంతవరకు అమలునకు తెచ్చుచున్నారు.

# 62 హరిజనోద్ధరణ

మనదేశములో మాలమాదిగలు మున్నగు సుమారు $6\frac{1}{4}$ కోట్లు జనులు హరిజనులు అంటరానివారని సవర్ణులలో భావనకలదు. కొండలలోని కోయ, చెంచు, సవర, గోండ మున్నగు అడవిజాతులు $2\frac{1}{2}$ కోట్లును సుమారీస్థితిలోనే యున్నారు. ఇట్లు మొత్తం హిందూజనసంఖ్యలో మూడవ వంతు జనులను, ముఖ్యంగా బీదకార్మికులను మనము నరుల కన్న హీనముగా చూచుటవలన దేవుడు హర్షింపక, మనకు ఈ హీనస్థితిని కల్గించెనని గాంధి గారెంచుచున్నారు. ద్వేషము ఆశ్రయాశనివంటిది: ఇప్పటి మన ముస్లిములలో హెచ్చు మంది హరిజనులనుండి ముస్లిముమతస్థులైనవారి సంతతియే. ఇకనయినను హరిజనులను సవర్ణులు సమభావముతో ఆదరించనంతకాలము స్వరాజ్యము వచ్చినను ప్రజలు సుఖమనుభవించలేరు. సవర్ణహిందువులు ముస్లిములను గూడ హరిజనులతో సమముగానే న్యూనపర్చి, అణచి వేతురని లీగునాయకులు ముస్లిముజనుల నమ్మించినారు. పాకిస్తానువాదమును హెచ్చుముస్లిములు ఆమోదించుట కిది యొక ముఖ్యకారణము. మరియు హీనస్థితిలోనున్న హరిజనులను వేలకొలదిని నిర్బంధంగా ముస్లిముమతములోనికి కల్పుటకు తూర్పుబెంగాలులో, పంజాబులో ముస్లిముప్రముఖులు యత్నించుటలోనే యెక్కువ హిందూముస్లిము కొట్లాటలు

దౌర్జన్యాలు జరిగినవి. కనుక హరిజనుల అస్పృశ్యతను వెంటనే తొలగిస్తే హిందూసంఘమంతయు బలపడుటయేగాక హిందూముస్లిముకలహాలును చాల తగ్గి జాతియైక్య మేర్పడును. అనగా బ్రిటిషువారి ప్రాబల్యమున కాధారముగా నున్న సాంఘికవిభేదాలు తొలగి స్థిరముగా నిల్చుటకును, హరిజనోద్ధరణయు, అస్పృశ్యతానివారణయు ఆవశ్యకములన్నమాట. అస్పృశ్యత హిందువులలో ఆ చా ర ము గ ను న్న ను, గోమాంసభోజనము, నరబలి, సహగమనము, నియోగము (మరదిచే బిడ్డలగనుట,) అతిబాల్యవివాహము, యిట్టి పూర్వపు ఆచారాలు మార్చినట్లే దీనినిగూడమార్చుకొనవలె. ఎన్నియో పూర్వాచారాలు దేశకాలానుసారముగా హానికరమైనవానిని శాస్త్రీయాలయినను ఆచరించక మార్చుకొమ్మని శాస్త్రాలలోను చెప్పినారు. * "ఈఅస్పృశ్యత అనేవి హిందూమతమునకు వేరుపురుగు. అస్పృశ్యత అటులేఉంటే హిందూమతము బాగుపడి వృద్ధియగును." అని గాంధిమహాత్ముడు చాలసార్లు చెప్పియున్నారు.

---

* అస్వర్గ్యంలోకవిద్విష్టం ధర్మమప్యాచరేన్నతు...దేవరేణ సుతోత్పత్తిః మధుపర్కేపశోర్వధః మాంసదానంతథాశ్రాద్ధే వానప్రస్థాశ్రమస్తథా......ఇమాన్ ధర్మాన్ కలియుగేవర్జ్యానాహుర్మనీషిణః

(బృహన్నారదీయం)

దత్తౌరసేతరేషాంతు...భృగ్వగ్ని మరణం చైవ వృథాదానంతథైవచ, నివర్తితాని కర్మాణి వ్యవస్థా పూర్వకంబుధైః సమయశ్చాపిసాధూనాం ప్రమాణం వేదవత్ భవేత్ _

(ఆదిత్యపురాణవచనం)

ఈఅస్పృశ్యతలో చాలరకాలు. గ్రామసమిష్టి వగు నూతులు, చెరువులు, బడులు, హోటళ్లు, చావిడులు ఇత్యాదులలోనికి క్రైస్తవులు, ముస్లిములు ధారాళముగా వచ్చుచున్నారు; పేటిలోనికి హరిజనులు రాకూడదనుటలో అర్థము లేదు. గాంధిగారికోరికపయిన కొన్నిరాష్ట్రాలతోబాటు మన రాష్ట్రములోను వాటిలోనికి హరిజనులను రానివ్వవచ్చు నని, అందు కడ్డుకున్నవారికి శిక్ష విధింపబడునని యిటీవలనే కాంగ్రెసుప్రభుత్వమువారు శాసనసభ సమ్మతితో చట్టముచేసినారు. ఇట్లే మనయిండ్లలో ప్రస్తుతము క్రిష్టియన్లను ముస్లిములనురానిచ్చుచోటికయినను హరిజనులను రానిచ్చుట న్యాయము. గాంధిగారు తనజీవితంలో అస్పృశ్యతను పాటించకపోవుటే గాక, ఒక హరిజనబాలికను కుమార్తెగా పెంచిరి. తన ఆశ్రమమునందు హరిజనులకు సమానస్థానమొసంగిరి. అఖిలభారత హరిజనసేవకసంఘము నేర్పాటుచేసిరి.

పబ్లికు దేవాలయములు హిందువులందరి నిమిత్తము మేర్పడినవి. ముఖ్యముగా ఈ దేవాలయముల ప్రత్యేకత సమిష్టి విగ్రహారాధన. విష్ణుభక్తులు విష్ణ్వాలయాలలోనికి, శివభక్తులు శివాలయాలలోనికి వెళ్ళి భగవంతుని దర్శించి, సమిష్టి ప్రార్థనలో పాల్గొనుట వారిజన్మహక్కు. అట్టిస్థితిలో హరిజనులుమాత్రము దేవాలయాలలోనికి రాకూడదనుట సబబుగ తోచదు. ఈ ఆలయస్థాపకులుగాని, శాస్త్రాలుగాని అట్లు నిషే

ధించినట్లు యెక్కడా నిదర్శనాలు లేవు. కొందరు శాస్త్రులలో నిషేధించిరని చెప్పగా గాంధిమహాత్ముడు సనాతనధర్మమహామండలి అధ్యక్షులగు కీ.శే. శ్రీ పండిత మదనమోహన మాలవ్యాగారి పర్యవేక్షణక్రింద ఆచార్య రుద్రిలాంటి ప్రకాండ విద్వాంసుల అధ్యక్షతను అన్ని పక్షాల పండితులసభను జరిపించిరి. కొన్నిరోజులు విపులచర్చ జరిగి, తుదకు 'హరిజనుల దేవాలయప్రవేశము శాస్త్ర నిషిద్ధముకాదు; అస్పృశ్యత శాస్త్రసమ్మతముకాదు; అని ఆసభవారు తీర్మానించి స్థిరపర్చినారు. స్వతంత్ర భారతదేశములో అస్పృశ్యత అసలే కూడదని ఢిల్లీలో రాజ్యాంగపరిషత్తువారును యిప్పుడు శాసించిరి.

'ఈవిగ్రహారాధన అనేది పామరులనిమిత్తమే ఉద్దేశింపబడినది. జ్ఞానవంతులు సర్వవ్యాపియగు దేవుని తమ హృదయములలో సర్వత్ర ధ్యానించి భజింపవలె. వారికి మూర్తిపూజ వ్యర్థము' అని పురాణములలో చెప్పినారు. * హిందువులలో హరిజనులే అప్పటికి యిప్పటికి యెక్కువ అజ్ఞానులు, పామరులు: కనుక సమిష్టిమూర్తిపూజ కుద్దేశించు దేవాలయాలలో

* శివమాత్మని పశ్యంతి ప్రతిమాసు నయోగినః అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాః పరికల్పితాః (స్కాందపురాణం) యోమాం సర్వేషు భూతేషు సంతమాత్మాన మీశ్వరం హిత్వాఽర్చాంభజతే మౌఢ్యాత్ భస్మన్యేవజుహోతిసః (శ్రీమద్భాగవతం) నచక్షుషాగృహ్యతే నాపివాచా (ముండకోపనిషత్తు) తతోయదుత్తరతరం అరూప మనామయం.

(శ్వేతాశ్వతరోపనిషత్తు)

ముఖ్యముగా వారికిప్రవేశ మీయవలె. వారిని నిషేధించుట ఆసుపత్రిలోనికి రోగులను, విద్యాలయాలలోనికి విద్యలేనివిద్యార్థులను అడ్డగించినట్లుండును. పురాణాలకు పూర్వములు, అంతకన్న ముఖ్యప్రమాణాలు అగు శ్రుతి స్మృతులలో, గీతలలో, వేదాంతసూత్రాలలోగూడ యిట్టినిషేధాలు లేవు; సరిగదా, వానిలో విగ్రహారాధన ప్రసక్తిలేదు; ఈశ్వరుడు రూపరహితుడు, అప్రమేయుడు, సర్వభూతాంతరాత్మ, హృదయస్థుడు, అనియే నిరూపించినారు.

దరిమిలాను యేర్పడిన ఆగమాలలోను వ్యాధిగ్రస్తులు, త్రాగుబోతులు యిత్యాదులకు కొన్ని ఆటంకాలు చెప్పినా కొన్నిటిలోమాత్రము పతితులు, పాతకులు, చండాలురు లోపలకు వచ్చిన కొంతపరిహారము చెప్పినమాట నిజమే, కాని శాస్త్రాలలో చెప్పినచండాలురు, బ్రాహ్మణస్త్రీకి శూద్రజనితులు. * ఈకోలది హరిజనులు బ్రాహ్మణస్త్రీసంతతి అనుటలో అర్థములేదు. మరియు పంచమజాతి అనేది లేదని, మొత్తము నాలుగే వర్ణాలు జాతులు, అని మనుస్మృతిలోను చెప్పినారు.

---

* పతితేః, పాతకీచైవ...(ఈశ్వరసంహిత)

మరియుఇప్పుడు శాస్త్రరీత్యా పతితులు పాతకులు అగు సవర్ణులు ఆలయములోనికి వచ్చుచునేయున్నారు. వారిని బహిష్కరించితే వారి తరువాతనే చండాలురకు బహిష్కరణమాటవచ్చును, చండాలురనగకోపిష్ఠులు అనిశబ్దార్థము.

పూర్వము వసిష్ఠవిశ్వామిత్రాది ఋషుల సంతతికిని చండాలసంపర్కముండెను. మరియు శంకర రామానుజాది పూర్వప్రవక్తలు, దయానంద రామకృష్ణ వివేకానందాది ప్రవక్తలును హరిజనుల నుద్ధరించుటకే మార్గదర్శకు లయినారు. ఇట్లే హిందువులలో తిరుప్పాణాళ్వారు, నందనారు, చోఖామేళు, రాయదాసు, హరిదాస ఠాకూరు, ఇట్టి హరిజనజాతివా రెందరో మహాభక్తులయి సనాతనుల కును పూజ్యులయినారు. హరిజన దేవాలయప్రవేశము హరి జనుల ఆధ్యాత్మిక నైతికాభివృద్ధికిని, ఆత్మగౌరవమునకు గూడ సహాయకరము. అస్పృశ్యత ముఖ్యముగా మత సాంఘిక సంబంధమయినది. కనుక, గ్రామాలలోగూడ ధారాళముగా దేవాలయాలలోనికి హరిజనులను రానిస్తే, యిక యీఅంటు అనేదిపోయి, హిందూమతము, జాతీయతయు మరల వృద్ధి నొందును. కనుక, సవర్ణహిందువులవలె మాలమాదిగలు మున్నగు హరిజనులును పబ్లికు దేవాలయాలన్నిటిలోకి వచ్చి దర్శించి పాల్గొనుటకు హక్కుకలదని మద్రాసురాష్ట్రము లోను, కాంగ్రెసుప్రభుత్వమువారు శాసనసభద్వారా చట్టము చేసినారు. కనుక 2-6-47 తేదీనుండి హరిజనులకు సవర్ణులవలె అన్ని దేవాలయాలలోనికి వచ్చుటకు సమానహక్కు యేర్ప డినది. ♦ అయితే ఆప్రకారము ధారాళముగా గ్రామాలలో అమలుజరిపించుట అవసరము.

♦ మదరాసురాష్ట్రపు 1947 సం. పె 5 రుఆక్టు.

# 63 ఆ ది మ వా సు లు

హరిజన సమస్యవంటిదే కొండజాతుల సమస్య. దక్షి ణములో నీలగిరి మొదలు ఉత్తరమున హిమాలయజాతులు, అస్సాం తెగలవరకు ఈమన్యపు జనులు చాలచోట్ల గలరు. ఆంధ్రప్రాంతములో మన్యములోని ఆదిమవాసుల అజ్ఞా నమ్ము, మూఢ విశ్వాసము, త్రాగుడు, దరిద్రము, భీరుత్వము, జ్వరగ్రస్తత అందరికీ తెలిసినదే. మన్యప్రదేశాల ప్రకృతి సంపద అద్భుతము. ఈ ఏజన్సీ ప్రాంతాలను కేటాయించి సర్కారువారింతవరకు తమకిష్టము వచ్చినట్లు పాలించినారు. ఏజన్సీకి, వెల్లడి ప్రాంతాలకును పరస్పర సమన్వయముచేసి 'ఏజన్సీ' జనుల మూఢ విశ్వాసాలను, అజ్ఞానమును బీదతన మును పారద్రోలి, అక్కడ వ్యవసాయము వగయిరా పరి శ్రమ లేర్పర్చి, మన ప్రాంతపు నాగరిక భాషలను కొండ జనులకు నేర్పి విద్యావంతులగునట్లు చేయుట అవసరము. అక్కడి జలవాయువులను, ఆహార వస్తువులను పరిశుభ్ర స్థితిలో నుంచితే, మన్య ప్రదేశాలలోను ఆరోగ్య వాతావర ణము కలుగును. మన్యపుజనులకు హాని కలిగించకుండగనే, వెల్లడి ప్రాంతాల జనులక్కడ వసించి, ఆసంపదను వృద్ధి జేసి వ్యాపారము లొనర్చి, అక్కడ జనసంఖ్య, వస్తూత్పత్తి, నాగరికత బాగుపడునట్లు కృషిచేయవలె నని గాంధిగారి

యుద్బోధన. ఈ ఆదిమవాస సమస్యను పరిష్కరించి, దుర్గమ ప్రాంతాలను సంచారయోగ్యముగా, జనవాససుకరముగా, నాగరికముగా చేయుటకు అస్సాం, బీహారు, బొంబాయి నగరాలలోవలె, మదరాష్ట్రములోను కాంగ్రెసు ప్రభుత్వము వారొక సమితిద్వారా విచారణ జరిగించి; ప్రణాళికను తయారుచేయుచున్నారు. కోయలు, చెంచులు, బడగలు, భిల్లులు, గాండులు, సవరలు, సంథాలులుమున్నగు ఈకొండ జాతులు కేవలము కాష్టలోష్టములనే పూజించుచు, మూఢాచారములతో నుందురు. వారి స్వభావములును విచిత్రములు. కొందరు మాన్యులీ కొండజాతులతోనే వసించి, వారి నుద్ధరించుటకు కృషిచేయుచున్నారు. ఈవిషయములో ముందుగనే క్రైస్తవ మిషనరీలు రంగములో ప్రవేశించి, మిషను సంస్థలను మన్యాలలోను వ్యాపింపజేసినారు. వారు చేయుపని మంచిదే; కాని, వారు పాశ్చాత్య దృక్పథముతో క్రైస్తవమత వ్యాప్తికై చేయు కృషి కొంత హానికరము. హిందూ ప్రముఖులాప్రాంతాలలో పరిశుద్ధ హిందూమతమును, భారతీయ సంస్కృతిని, శుద్ధ సంప్రదాయాలను బోధించి, రెండు ప్రాంతాలమధ్య ఐకమత్యము వృద్ధిచేయించవలెననియు గాంధిగారు బోధించినారు.

---

# 64 సాంఘిక మైత్రి

అఖండ భారతంలో నాల్గవవంతు జనులు ముస్లిములు అనగా తురకలు. వారిలో దాదాపు అందరూ హిందువులలో నుండియే దరిమిలాను ముస్లిములైనవారు. జిన్నా, ఫజులుల్ హక్, ఇక్బలు, ఖిజరుహయ్యాత్, షేక్ అబ్దుల్లా, ఘఫారీ మున్నగు నాయకులందరు యిట్టివారే. సుమారు 49 యేండ్ల క్రిందటి వరకు హిందూముస్లిములు ఐకమత్యము గల్గియుండిరి. ఆ యా ప్రాంతపుభాషనే స్వభాషగ మాట్లాడుచుండిరి. చీనా, రష్యా మున్నగు పెద్ద రాజ్యాలలో వివిధమతస్థు లొకజాతిగ వ్యవహరించుచుకలసి కృషి చేయుచున్నారు. బ్రిటిషువారి శాసనీతి, మన తెలివితక్కువ వలన మన దేశములో యిటీవల మతకలహాలు పెరిగి రాజకీయైక్యమున కడ్డువచ్చినవి.

బ్రిటిషువారు ఈజిప్టు, పాలెస్తీను, బర్మా, సింహళ మలయా మున్నగు తమ పాలిత దేశాలన్నిటిలో శాసనీతి నవలంబించిరి; విభజించి పాలించుట సామ్రాజ్యవాదుల సంప్రదాయము. జాతీయవాదుల నణచి, అయామతాలను ప్రోత్సహింతురు. హిందూ సంస్కృతికి కాశీని, ముస్లిము సంస్కృతికి అలీఘర్‌ను కేంద్రాలుగచేయించి, అక్కడ ప్రత్యేకమగు మతాధారపు కళాశాలలకు, విశ్వ విద్యాలయాలకు ప్రోత్సాహమిచ్చి, వారి దృక్పథములను సాంఘిక కులతత్వము వైపునకు మార్పించినారు. ఎన్నికలలో ప్రత్యేక నియోజక వర్గాలేర్పర్చి, మత కులములబట్టి ఉద్యోగాలలోగూడ పోటీలు

పెంచినారు. అది సహజమే. దాని నాక్షేపించుటకు బదులు మనము జాతీయతను సాంఘిక మైత్రిని బలపర్చుకోవలె.

గాంధిమహాత్ముడు అన్నిమతాల గ్రంథాలనూ చదివి, సమభావము కలిగి, యెందరో ముస్లిములతోను, క్రైస్తవులు మొదలగువారితో స్నేహము కలిగియున్నాడు. 1919 సం॥రం నుండి ఖిలాఫతు యుద్యమ సందర్భములో ముస్లిము లనేకులు జాతీయవాదులయిరి. తరువాత బ్రిటిషు అధికారుల ఆకర్షణతో కొందరు కొట్లాటలు, సాంఘిక కలహాలు పెంచుకొన్నారు. విద్యావంతులలో ఉద్యోగాదులయందు పోటీలు పెరిగినవి. ధనికవర్గములో, జమీందార్లలో, రాజులలో, విద్యార్థులలో గూడ సాంఘికతత్వము పెరిగి చీలిక లేర్పడినవి. అన్నివర్గము లలోను ముస్లిములు వేరుసంస్థలను ఏర్పాటుచేసుకొని సాంఘిక తత్వమును ప్రకోపింపజేసినారు. ఈ రీతిగ క్రైస్తవులు, సిక్కులు మొదలైనవారిలోగూడ ప్రత్యేకతత్వముగల సంస్థలు తలలెత్తినవి. ఈ సాంఘిక ద్వేషమును పోగొట్టి మైత్రి స్థాపించుటకు గాంధిగారెంతో కృషిచేసిరి. చాల వ్యాసాలు, ఉపన్యాసాలు చేయుటయేగాక, 1924 సం॥రంలోను దరిమి లాను, సాంఘికసఖ్యసాధనకు ఉపవాసాలను చేసిరి. జాతీయ ముస్లిములకు కాంగ్రెసులో ఉచితస్థాన మిప్పింప 1931 సం॥రము రౌండుటేబిలుసభ, ఇటీవల సిమ్లాసమావేశము యిత్యాదులలో ఆయన యెంతో కృషిచేసెను.

ఉభయసంఘాల ప్రముఖులమధ్య సామరస్యబుద్ధి తగ్గియు, పరస్పరము అవిశ్వాసము, హ్రస్వదృష్టి, పరాయి వారి కూటనీతి వలన సాంఘికవిభేదాలు హెచ్చినవి.

ముస్లిములు హెచ్చుగాగల రాష్ట్రాలలో బ్రిటిషువారు లీగువారికే యెక్కువ ప్రాముఖ్యమిచ్చి, వారినే ముస్లిము నాయకులుగ నెంచి, జాతీయముస్లిముల నణచివేసినారు. లీగుముస్లిములకే బ్రిటిషువ్యాపారస్థులు, యితరులును సదుపాయాలిచ్చి తోడ్పడుట మరొకవిశేషము. మరియు ముస్లిము జనాభా హెచ్చుగానున్న రాష్ట్రాలు ప్రత్యేకరాజ్యాలు కావలెనని, వారు ప్రత్యేకజాతియని మొదట ఆంగ్లేయులే వాదం తెచ్చిపెట్టి లోలోపల జిన్నాపక్షమునకు బలమిచ్చిరి. 1940 సం॥రంలో ఈ 'పాకిస్థాను' ముసలము పుట్టినది. ఉభయ పక్షాలమధ్య తీవ్రద్వేషప్రచారము! దేశమంతట సాయుధ హత్యలు సాగినను, వాటిని సవ్యంగా అధికారు లణచలేదు. మౌంటుబాటనుగారు (కాబినెటుసమ్మతితో) పాకిస్థాను నంగీకరించి కథ పూర్తిచేసినారు. ముస్లిములలో హెచ్చుమందికి హిందువులపయిన అవిశ్వాసం ఉన్నట్లు మొన్నటి ఎన్నికలలో సూచితమయినది. మరల సుహృద్భావ మేర్పర్చుట కిప్పుడు గాంధిగారు గట్టి కృషి చేసినారు. హిందువు లీవిషయములో కొంత ఆత్మపరిశోధన చేసుకొనవలెను. సాంఘికముగా పరస్పరమైత్రి వృద్ధిచేసుకొంటే, అవిశ్వాసాలు పోవును. కనుక ప్రతిప్రాంతములోను మైత్రికృషినే చేయవలెనని ఆయన ఉద్బోధించి, ఆత్మార్పణ చేసినారు.

# 65. జాతీయ భాష

'భారత దేశ మొకటే అది అఖండహిందూస్థానము' అని హిందువులందరు వచింతురు. అది క్రియాత్మకము కావలె, వెంటనే దేశమంతటికి జాతీయభాష యేర్పడవలె. స్వభాష గుజరాతీయైనను గాంధిగారు హిందుస్తానీయే జాతీయభాష కావలెనన్నారు. బ్రిటిషుసామ్రాజ్యపుబాధ పోయినది. కాని ఆంగ్లభాషాసామ్రాజ్య మింకను మనకు కావలెనా? చాల యేండ్లనుండి ఆయన సమావేశా లన్నిటిలో హిందూస్తానీనే వాడుచున్నారు. 1917 సం॥రంలో యుద్ధసహాయసభలో వైస్రాయి మున్నగు మహోద్యోగుల యెదుటను ఆయన హిందూస్తానీలో మాట్లాడెను. ఇప్పుడు కేంద్రజాతీయసమావేశాలన్నిటిలో హిందూస్తానీలోనే చాలవరకు ప్రసంగాలు జరుగుచున్నవి. ఇటీవల మద్రాసులో సమావేశాలలోను ఆయన కేవలము హిందూస్తానీలోనే మాటాడెను. ఆ హిందీప్రాంతాలలో జాతీయ భాషాప్రచారమునకై మద్రాసులో హిందీప్రచారసభ, (ఇప్పుడు హిందూస్తానీప్రచారసభ), వర్ధాలో తక్కినప్రాంతాలనిమిత్తము వేరే మరొక సంఘమును ఆయన స్థాపించి నడిపించుచున్నారు. తాను 'ఆంగ్ల హరిజన్'తో బాటు హిందూస్తానీలో "హరిజనసేవక్" అను వారపత్రికను రెండులిపులలో సాగించుచున్నారు. ఈ భాష దేశము మొత్తమువిూద సగముమందికి బాగా తెలిసినది.

హిందూస్తానీ వాఙ్మయము చాల వేగముగా వృద్ధి జెందుచున్నది; అది ముందుకు మన దేశపు జాతీయవాఙ్మయ మగును. దానిద్వారా మన మాతృభాషల సాహిత్యముకు వృద్ధి చేసుకోవచ్చు. ఆంగ్లము అంతర్జాతీయభాష. కనుక దానివలన కొందరికుపయోగముండును. కాని క్రమముగా మన స్కూళ్ళలో యింగ్లీషున కిప్పుడున్న ప్రాముఖ్యముతగ్గి హిందూ స్తానీకి ఉచితస్థాన ముండగలదు.

ఈ జాతీయభాష శైలి సంస్కృత, అరబ్బీ, పారసీ భరితము కాకుండ మధ్యరకముగ నుండవలెనని గాంధిగారు నిర్ణయించినారు. ఈ శైలిలోనే మంచి వాఙ్మయము సృజించుటకు కృషి జరుగుచున్నది. దక్షిణభారత హిందూస్తానీ ప్రచారసభకు ఆయన యావజ్జీవితాధ్యక్షుడుగనుండిరి. వారి మరణానంతరం రాజేంద్రప్రసాదుగారు అధ్యక్షులుగ నెన్నుకొనబడిరి.

ఆంధ్ర దేశములోను, నిజాముసంస్థానపు తెలంగాణాలోను రాజభాషగ ఉర్దూలిపిలో పారసీమిశ్రితభాష వ్యాపించుచున్నది. ఆ సంస్థానములో హిందూస్తానీని నాగరలిపిని మాతృభాషతో పాటుగా ప్రోత్సహించునట్లు ఒత్తిడిచేయవలెను;

హంతకుడావిషయము కనిపెట్టెను. ఆ మరణరాత్రి యంతయు జనప్రవాహము బాపూ దేహమున కంత్యపూజ సల్పుచుండిరి. మరునాడుదయం స్పెషల్ శకటంలో దేహము లక్షలకొలది జనులతో పటాంటుబాటను, నెహ్రూ, పటేలు, ఆజాదు, రాజేంద్రాదు లను సరింపగా, సర్వదిశలనుండి పుష్పవర్షముకురియుచు, జనులందరి కన్నీరు కాలువలగుచుండగ యమునాతీరపు రాజఘట్టమందు చేర్చబడెను. ప్రియపుత్రులు, దేవదాసు రామదాసులు అంత్యేష్టి జరిపిరి. "మహాత్మాజీ అమర్ హోగయే, గాంధీజీకీ జై" అను కేకలు మిన్నుముట్టెనవి. రాజధానినగరములో ప్రాణమిచ్చిన గాంధిజీ కిట్లు చక్రవర్తి కన్న హెచ్చు గౌరవంతో ఉత్తరక్రియలు జరిగినవి.

భారతజాతి జనకుని మృతికి శోకసూచకంగా మన ప్రభుత్వం, పాకిస్తాను సర్కారు, పతాకాలను 14 రోజులు అవనతంచేసిరి. బర్మా సింహళాదులేగాక సంయుక్తజాతి సమితివారును న్యూయార్కులో సర్వజాతి పతాకము నిల్లేదించిరి. భారత పాకిస్తాను నాయకులేగాక అమెరికా, బ్రిటను, రష్యా, ఫ్రాంసు, తురుష్కరాజ్యాలు మున్నగు ప్రపంచపు నాగరిక రాజ్యాలన్నిటి పాలకులు, నాయకులు, విజ్ఞానవేత్తలు, తమ సంతాపమును వెలిబుచ్చిరి. అస్థినిజమజ్జనక్రియ అనితరసాధ్యమగు మహావేశంతో 20 లక్షలమంది సర్వమత

వర్గాల భారతీయుల శ్రద్ధాంజలితో సహా విమానాలు పుష్ప ములు వర్షించుచుండ ప్రయాగతీర్థంలో అద్భుతంగా జరిగినవి. గాంధిగారి అస్థికలలో (బుద్ధునకువలె) కొన్నిమాత్రం మహాత్మునికి స్మారకంగా భద్రపర్చబడినవి. బర్మా, సింహళాలలో అనన్యగౌరవంతో చితాభస్మము పవిత్రజలంలో కలుపబడినది.

మహాత్ముని జ్ఞాపికలుగ రాజఘట్టం ఇత్యాదులలో భవనాలు నిర్మించుటేగాక చాలచోట్ల వివిధ సంస్థలకు రాజమార్గాలకు, నగరములకు ఆయన పేరు పెట్టుట, ఆయన శిలావిగ్రహాలను స్థాపించుట ఇత్యాది స్మారకములు జరుగుచున్నవి. ప్రభుత్వ న్యాయ భవనాలన్నింటిలో గాంధిమహాత్ముని చిత్రపటము లుంచునట్లు ప్రభుత్వమువారు నిర్ణయించినారు. హిందువులు, ముస్లిములు, రాజులు, ప్రజలు, పూంజీపతులు, బీదలు అను భేదములేకుండ అశేషజనులు ఏక కంఠంతో గాంధిజీ లోకోత్తర పురుషుడని గుర్తించి అనుతాపంపొందినారు.

## ఆత్మార్పణం.

ఇట్టి సర్వసమానుడు, అహింసాప్రవక్త, లోకక్షేమం కోరుడునగు పరమపవిత్రుని జీవితమిట్లు హంతకునిద్వారా అంతమయినదని ఉద్వేగము గల్గుటసహజం. ఆయనకుతగిన రక్షణ లేదనివాపోవుట వ్యర్థము. తక్షకునుండి మరణము తప్పించుకొను

టకుపూర్వం పరీక్షిత్తుచక్రవర్తి ప్రమాదమునకు అవకాశము లేకుండ అన్నికట్టుదిట్టములు చేసినను ఒక విప్రవర్యుడిచ్చిన ఫలం లో కీటకముద్భవించి హఠాత్తుగ తక్షకుడై కాటువేసెనని, తక్ష ణము మరణము కల్గెనని ఇతిహాసము చెప్పుచున్నది. ఉత్తమ పురుషుల ఉజ్వలజీవితము లిట్లు అంతమొందుట లోకచరిత్రలో జరుగుచునేయున్నది. శ్రీరాముడు సరయూ నదిలో నంత మొందెను. శ్రీకృష్ణుడు తపోనిష్టలో నుండి వ్యాధునిబాణముతగిలి జీవితం చాలించెనట. విజ్ఞాన ప్రముఖుడు, మహాతత్వజ్ఞుడు అగు సోక్రటీసు తత్వప్రచారం చేసినందుకు శిక్షగ ప్రభుత్వంచే మరణశిక్షనొంది విషమును స్వహస్తంతోతాగి అంతమొందెను. ఎందరో విజ్ఞానవేత్తలు యూరపులో ప్రకృతినిగూర్చి సత్యప్రచారం చేసినందుకిట్టి ప్రాణాంతపు ఫలమనుభవించిరి. ఏసుక్రీస్తు ప్రేమ, సత్యము ధర్మ ములను బోధించిన ఫలంగా ప్రభుత్వముచే కొరతవేయబడి జీవితమును చాలించెను. అమెరికా అధ్యక్షుడు అబ్రహాంలింకను బానిసల స్వాతంత్ర్యమునకై ఘోరయుద్ధంసాగించి జయమొం దినప్పుడు మహాసభలో హంతకునిచే కాల్చబడెను. ధర్మ ప్రచారకుడు స్వామి శ్రద్ధానందుడు ఢిల్లీలో నిట్లే హత్య చేయ బడెను. ఇవి దుర్మరణాలనుట తప్పు. ఈమహాత్ముల జీవితసందేశ ముల నప్పటి జనులుగ్రహించి ఆచరింపనంత నిర్భాగ్యులయిరి.

లోకక్షేమకరమగు బాపూజీ ప్రేమ సందేశమును పామరులు, విద్యావంతులుగూడ గ్రహించి ఆచరించు

స్థితిలో లేరు. 78 ఏండ్లవయస్సునను స్థితప్రజ్ఞత అద్భుతనిగ్రహ జీవితంవల్ల ఆయన యువకులకుండు ఆరోగ్యంకలిగి నిరంతరం అతిశ్రమకరమగు కార్యక్రమమును ప్రీతితో నెరవేర్చుచుండెను. ఎట్టి క్లిష్టసమస్యలలోను నెహ్రూ, పటేలు వగైరా లందరికిని ఉత్తమ సూచనలిచ్చు మనశ్శక్తితో నుండెను. హృదయవిదారక మగు దుఃఖపరిస్థితులలోను పాల్గొనుచు హృదయశక్తి, ప్రసన్నతచెడని ఆత్మబలము కలిగి సర్వత్ర ప్రేమభక్తులు ప్రసరింపజేయుచు, లోకహితకార్యముల జేయుచుండెను. లోకంలోజరుగు వైకల్యములు, హింసా ప్రవృత్తులు, విషప్రచారము చూచుచు జీవింపదలపలేదని 125 ఏండ్లు జీవించు సంకల్పముపోయినదని అంతకుముందే ఒకరికాయన తెల్పెను.

పశ్చిమపంజాబులో జరుగు క్రూరహింసలను సహింపలేక కొందరు గాంధీవాదులును, ఆప్రాంతం వదలి విచ్చేసిరి. వారు కార్యరంగమందే ఉండి ప్రమాదము లెదుర్కొనుట ఉత్తమమని ఇటీవలనే ఆయన వచించెను. అప్పుడొక జాతీయ వాదియే గాంధిగారిని "మహాత్మా! తమఉపదేశము సరియే కాని అది ఆచరణసాధ్యమని తాము క్రియలో నిరూపింతురా?" అని కోరెనట. అంతట "హింసాప్రచారము నెదుర్కొనుకృషి నేనిప్పుడు చేయనున్నాను, పంజాబువచ్చుట కాతురపడుచున్నను సమయమింకనురాలేదు, ఈలోగా హింసాతత్వం

తోపోరుటే నాకర్తవ్యము. ఆకార్యంలో సంతోషంతో జీవితం చాలించగల్గుట నాకు ప్రియతమమగువాంఛ. అప్పుడేనాజీవితము నిజంగా సఫలమగును. నాఆచరణ బోధనానుసారి యగును. అంతటి ధన్యజీవినిచేయుమని ఈశ్వరుని ప్రార్థించుచున్నాను. కాని నాయంతట నేను అందుకు ముందుకురుకుట అహంభావమగును. కనుక అందుకు త్వరపడను. నాకృషిలో ఈశ్వరుడే అట్లు ప్రసాదించుట నాఉత్తమవాంఛ." అని మహాత్ముడు జవాబిచ్చెనట. తుదకట్లే జరిగి ఆత్మాహుతిద్వారా ఆయన జీవితయజ్ఞము పూర్తిఅయినది.

# హ త్యా కా ర ణ ం

గాంధిగారి హత్యాకారణమేమి? ఆయన యెవరికిని హానిచేయ తలపెట్టలేదు! జనవరి 20 వ తేదీని ప్రార్థనాసమావేశమునకు దగ్గరనే బాంబుపేలినను ఆయన అద్భుతనిగ్రహముతో అందునుగూర్చినిర్లిప్తుడై ఉపన్యసించుట అద్భుతమని పత్రికలలోజదివి, ఆ సౌ మ్య మూ ర్తి యిట్లు జవాబిచ్చెను. "ఇందులో నాఘనత లేదు. ఇక్లెవ్వరో బాంబు వేసిరని అప్పట్లో నాకు తెలియనేలేదు. ఇంతకు అతని ఉద్దేశమేమో! నాయెదుటకువచ్చి హంతకుడు ఆయుధమును ప్రయోగిస్తే, ప్రమాదమును గ్రహించియు నేనుజంకక, అతనిని ద్వేషింపక, చిరునవ్వుపీడక ప్రాణమిచ్చియుంటే, ప్రశంసకు అవకాశముండె

డిది. ఆది అహింసకు చివరమెట్టు, కాని త్వరలోనే అట్టి చరమ పరీక్షవచ్చునని, గాంధిమహాత్ముడు ఆకస్మికహత్యలో అంతటినిదానంతో రామస్మరణచేయుచునే దేహమును వీడునని అప్పట్లోయెవ్వరు ఊహించలేదు. అంత్యకాలమున ఈశ్వరుని స్మరించుట ముక్తినిచ్చునను గీతావాక్యము ఫలించినది.*

*అంత్యకాలేచ మామేవస్మరన్ ముక్త్వా కళేబరం।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

ఏసుక్రీస్తుబోధల ప్రకారం నడచినమహాసీయుడుగాంధిమహాత్ముడొక్కడే. ఆయనజీవితంవల్ల బైబిలు బోధలుసత్యమని, అందలి ఉపదేశాలు ఆచరణసాధ్యములని, ప్రత్యక్షంగా నిరూపితమైనందున కెంతయుధన్యులమని, గాంధిగారు లోకోత్తరుడని, ఆర్చిబిషప్పు మొదలగుక్రైస్తవభక్తులందరు ప్రశంసించిరి. ధర్మప్రచారమునకు కినిసి స్వజాతీయుడే ఆయనను చంపవచ్చినను శిలనొగ్గి క్రీస్తువలె ఆత్మార్పణ చేసియున్నాడు అది అద్భుతమనిరి. సరిగా అట్టి అద్భుతఘటన గాంధిగారిజీవితమున గుట విచిత్రముగదా?

క్రీస్తు, సోక్రిటీసు వగయిరాల ఉత్తమబోధనల నప్పటి కొందరు విభేదపరులు సహింపక రాజకీయ దురభిలాషవలన ఆయనను హత్యచేయుటకు సిద్ధపడిరని చారిత్రికులు వ్రాసినారు. గాంధిగారిహత్యకును అట్టికారణమున్నదా? ఈవిషయమింకను హంతకుని విచారణలోగాని స్థిరపడదు. అందుకు కొంత

కాలము పట్టును. కాని యింతవరకు తెలిసిన కొన్ని అంశముల స్మరియింపవచ్చు. ఇది వ్యక్తిద్వేషంవల్ల తాత్కాలికోద్రేకం వల్ల ఆతతాయిచేసినదికాదు. ఈదారుణచేష్ట లోకమంతటికి అపారనష్టకరమని అమెరికా అధ్యక్షుడు, బ్రిటీషురాజు మొద లగు ప్రాజ్ఞులందరు మరునాడే తెల్పిరి. ఈహంతకుడొకహిందు వేఅని ఆహత్యజరిగినగంటలోపుననే రేడియోలో చెప్పివేయుట చాలమంచిదయినది. లేకున్న దేశమంతట కసితీర్చుటకని సాంఘిక హత్యలు వగైరాలుచెలరేగి, మహాత్ముని ఆత్మ క్షోభించి యుండెడిది.

ఆ హత్యచేసినవాడు హిందువు; నాథూరామ్ వినాయక గోడ్సే అను మహారాష్ట్రుడు, హిందూమహాసభ కగ్రణియగు సావర్కారుగారి శాఖీయుడట. అతడు ఆంగ్లపట్టభద్రుడు. పూనాలో 'హిందూరాష్ట్ర' అను దినపత్రిక సంపాదకుడు; రాష్ట్రీయ స్వయంసేవక సంఘపు ప్రముఖులలో నొకడు; తన పత్రికలో దినదినము ముస్లిములకు భారతరాజ్యంలో హక్కులు లేవని, ఇది హిందూరాజ్యమేనని, హిందూ ముస్లిం మైత్రిని బోధించు గాంధిగారు మనకు, ముఖ్యంగా హిందువులకు ఘోర మైన హాని కలిగించుచున్నారని, పాకిస్తాను ముస్లిమురాజ్య మైనట్లే, హిందుస్తాన్ హిందూరాజ్యంకావలెనని, తీవ్రప్రచా రంచేయుచుండెను. హిందూమహాసభవారీ సారి యెన్నికలలో ఇట్టికార్యక్రమంతో ప్రజలఓట్లు సంపాదించి గాంధిపక్షీయు

లను ఓడింపదలచిరి. కాని గాంధిగారియందు ప్రజలకను రాగము హెచ్చుచున్నదేగాని తగ్గుటలేదు. హిందువులు ముస్లిములనాదరించి సఖ్యతతో ఉండవలెనని, పాకిస్తాను ముస్లిములు అక్కడిహిందువులకు అన్యాయము చేయుచున్నను సరే మనము ముస్లిములవిషయంలో అక్రమం చేయకూడదని న్యాయమే తుదకు జయించునని గాంధిగారివాదము. క్రొత్త రాజ్యాంగమురాగానే ప్రతివయస్కునకు వోటు వచ్చును. కనుక చదువురాని, అజ్ఞానులగు హిందువులనందరిని జాతి మతోద్రేకముద్వారా తమ కనుకూలురుగ జేసుకొనవలయు నని పథకం పెట్టుకొన్నారు. మహాత్ముని అద్భుతాకర్షణైక్యతా శక్తి ఇందుకు ప్రబల ప్రతిబంధకములు, కనుక ఆయన లేక పోతే తమకార్యము సులభమగునని వారిలో కొందరు తలచి యుండవచ్చు. ఈహిందూమహాసభ కార్యవర్గమునకు కుడి భుజమే రాష్ట్రీయ స్వయంసేవకసంఘము. ఈ రెండుసంస్థలు హిందూక్షేమపాలనకొరకే ఏర్పడినవి. ఇందులో కొందరికి మాత్రమే ఇట్టి దురాలోచన కల్గియుండును. ఈసంస్థలకు కొందరు సంస్థానరాజులు, మిల్లుయజమానులవంటి పూంజీ పతులు, వారిదివానులు మొదలగువారు లక్షలకొలదిరూపా యలనిచ్చిరి. తమ వర్గమువారి స్వార్థరక్షణతోబాటు హిందూ ధర్మరక్షణకును తోడ్పడిన తమకు పేరుప్రతిష్ఠలు కల్గునని వారట్లుచేసిరేమో! గాంధిగారు సంస్థానాధికారు లాశించు

నిరంకుశ విధానమును, పరిశ్రమాధికారుల దొంగబజారు పద్ధతిని, పూంజీపతుల శోషణప్రక్రియను ఇటీవల నిర్దయగా ఖండించి నిరసించినారు. అది వారికి కంటకమగుట సహజము.

ఇటీవల ఢిల్లీలో ఆక్రమించిన మసీదులను హిందువులు, సిక్కులు ఖాళీచేయవలెనని, పోలీసు రక్షణద్వారానే కాక, ముస్లిముల కాపాంతంలో భద్రత స్వేచ్ఛ యేర్పడవలెనని గాంధిగారు పట్టుబట్టిరి. దేశవిభజన తరువాత ఇద్దరూ లెఖ్ఖలు చూచుకొనగా పాకిస్తానుకు 55 కోట్ల రూపాయలు నగదును, ఆయుధసామగ్రిలో కొంత భాగమును భారత యూనియన్‌వారు ఇవ్వనంగీకరించిరి. కాని కాశ్మీరమును గూర్చి పరిష్కారము కానంతవరకు ఆ సొమ్మును వారికీయకుండ మన ప్రభుత్వమాపుచేసినది. తన శిష్యులగు నెహ్రూ, పటేలు గార్లుచేసిన ఈ నిర్ణయమును గాంధిగారు బహిరంగంగా ఖండించిరి. దానితో ఈ సాంఘిక ద్వేషపరులు ద్రిక్తులైరి. ఆయనపైన తమ పత్రికలలోను ఉపన్యాసములలోను నిప్పులు కురిపించిరి.

ఇది ఇట్లుండగా సంయుక్తరాజ్య సమితిలో కాశ్మీర సమస్యను గురించిన చర్చలలో హిందు ముస్లిముల ప్రసక్తి వచ్చినది. ఆసమయంలోనే గాంధిగారు ముస్లిములకు జరుగు అన్యాయములు తొలగుటకని ఉపవసించిరి. అందుచేత మనకు అంతర్జాతీయంగానుగూడ గాంధిగారు హానికలిగించుచున్నారు,

ఇక ఆయన ఉండుట ప్రమాదకరము అను భావము వ్యాపింప జొచ్చెను. అగ్నికి వాయువు తోడైనది. ఉపవాససమయమున గాంధిగారి పట్టుమీద పాకిస్తానుకు 55 కోట్లు సొమ్మును మన వారు యిచ్చివేసిరి. మసీదులలో హిందూ విగ్రహాలను తీసివేసి ఖాళీచేయించ నిర్ణయమైనది. ఆయా ప్రాంతములలో హిందూ ముస్లిమ్ ఐక్యతా ప్రచారమునుచేసి, జనులలో శాంతిని స్థాపింప ప్రయత్నములు ప్రారంభమయ్యెను. దానికి ఫలితముగా అద్భుత పరిణామ మేర్పడసాగెను. అది యీ సాంఘిక తత్వపరులకు దుస్సహామగుట విచిత్రముకాదు. పాకిస్తానులో దెబ్బలుతిని వచ్చినవారు తాత్కాలికోద్రేకంలో చేసినదిగాక, నాథూరామ్‌గోడ్సే పని గట్టుకొని ఢిల్లీవచ్చి ప్రార్థనవేళ విశ్వ వంద్యుడగు గాంధిమహాత్ముని రివాల్వరునకు గురిచేసెను. ఆ హత్యరోజుకు ముందు తూర్పుపంజాబులో ఉపన్యసించు చున్న నెహ్రూను తుదముట్టించుటకు ఆ సభలో ఎవరో ప్రయత్నించిరట.

ఇంతేగాక, ఆ 30-1-48 తేదీని కొన్ని హిందూ సంస్థానములలోను, పూనా, బొంబాయిలలోని హిందూమహా సభ కార్యాలయముల యెదుటను కొందరావార్త రేడియోలో తెలియగనే మిఠాయీలను పిల్లలకు పంచిపెట్టిరట. పిడుగు వంటి వార్తవినగనే మన మందరము నిశ్చేష్టులమైతే ఈ కొద్ది మంది సంతోషమును పట్టలేక పోయిరి. కొందరా మధ్యా

హ్నామే కొలది సేపులో ఒక అద్భుతవార్త రేడియోలో వచ్చు నని జోస్యం చెప్పిరట. ఇదియంతయు గమనించిన యెడల మొదటనే పెద్దకుట్ర పన్నబడినట్లు తెలియగలదు.

# పరిశోధన.

గాంధిమహాత్ముని హత్య బర్మాలోని ఆంగ్సాను హత్యవలె రాజకీయోద్దేశప్రేరితమే. ఈ బహిరంగ హంతకుడు పూనా హిందూమహాసభ కార్యకర్త, దినపత్రికా సంపాద కుడు. అంతకు కొద్దిరోజులు ముందు బాంబు వేసి పట్టుబడిన మదన్‌లాలు అప్పటికి కొంతకాలంనుండి రాష్ట్రీయ స్వయంసేవకుల ఆంతరంగిక సమితివారు గూఢా లోచన చేసి ఆయుధాలను చేర్చినారని, ఎవరెవరిని చంప వలెనో చర్చించి నిర్ణయించిరని, తాను పదిరోజులక్రిందట బాంబువేసిన సమయంలో జనులు భీతులై చెల్లాచెదరు అయి యున్నచో ఆ గడబిడలో గాంధిగారిని చంపుటకు ఏర్పాటు చేసిరని, అది విఫలమాయెనని తెల్పెనట. తుదకు హత్యకై గోడ్సే లాటరీద్వారా నిర్ణీతుడై రహస్యపు విమానంలో పూనా బొంబాయిాలనుండి తిరిగివచ్చి హత్యరోజు ఉదయం మహాత్ము నిబసకు వచ్చి, అక్కడ నిరవకాశమగుట గ్రహించి, సాయం ప్రార్థనవేళ హత్యచేసెనని కొన్ని వార్తలు పత్రికలలో పడినవి. ఆ హత్యయైన మరునాడే రాష్ట్రీయ స్వయంసేవక సభలోని

ప్రముఖులనేకులు దేశమంతట అరెస్టుచేయబడిరి. ఈ సంస్థ, దీనితోబాటు ముస్లిం నేషనల్ గార్డు అను వాలంటీరుదళము గూడ అక్రమ సంఘములని నిషేధింపడినవి. కొంత పరిశోధన జరిగెను. కాని పోలీసులనుండి ఆరికార్డు నెవరో హరించిరట ! అయితే పాపము దాగదుగదా ! ఇప్పుడు పరిశోధన పూర్తి చేయబడుచున్నది. ఇంతటి కార్యం చేసితినని గర్వపడు హంతకునికి శిక్షపడుట కింత విచారణయెందుకని తోచవచ్చు. కాని ఈకుట్రలో తోడ్పడినవారెవరు, వారికెట్టి శిక్ష విధించవలె, ఇకముందు ఇట్టి విద్రోహ ప్రవృత్తి లేకుండుటకు, సంఘక్షేమమునకు ఏమి కట్టుదిట్టములు చేయవలె అను విషయములను తేల్చవలసియున్నది.

# అశ్రుతర్పణం.

జాతీయజనకుని బలిదానంతరువాత లోకప్రముఖులందరు శోకముదెల్పుచు మహాత్ముని గూర్చి తమభావాలు చెప్పినారు. వాటిలో కొన్నిటి సారమీక్రింద సంగ్రహించబడినది.

కాని, శ్రీకృష్ణనిర్యాణంగూర్చి అర్జునుడన్నతో చెప్పిన ఈక్రిందిపద్యమీసందర్భములో జ్ఞప్తికివచ్చును.

'మనసారథి మనసచివుడు, మనదైవము, మనగురుండు మనబాంధవుడున్! మనవిభుడు గురుడు దేవర'మనలను విడనాడి చనియె మనుజాధీశా॥

పం. జవహర్ లాల్ నెహ్రూ

మన అమూల్యనిధిని రక్షించలేనందుకు, 'బాపు' నొక భారతీయుడు, హిందువు చంపినందుకు నాకు సిగ్గుచున్నది. మనమందరము ఆయన బిడ్డలము. ఆయననుండి వ్యాపించు దైవ తేజస్సుకణములు కొన్నిటిగ్రహించు అదృష్టము మనకు కల్గి నది. ఆసాత్వికతేజము మూలమూలలనువ్యాపించి దేశమంతను పవిత్రము, శాంతివంతము చేసినది. ఈక్లిష్టసమయంలో బాపూమనలను నైతికంగాను ఉన్నతస్థితికితెచ్చి మార్గదర్శకు డయినాడు. ఆమహాసూత్రములను చిరస్థాయిచేసి ఆనిర్మాణ మార్గం అనుసరింపవలె. లేకుంటే ఆయనను శ్లాఘించుటకు మనకర్హతలేదు. ఇప్పుడేకాదు వేయేండ్లకును ఆయనప్రవృత్తి బోధన లోకమంతటికీ మార్గదర్శకముకాగలదు; ఇట్లు గుండు కెరనై హతాత్ముగ దేహం వదలినాడు; స్థితప్రజ్ఞునివలె ఫలము కాశింపకనే ఆయన నిరంతరం సత్కార్మ జేసినాడు; కాని జీవితం లోనే తనకృషి కొంతవరకైన ఫలించుట చూచినాడు. చరి త్రలో యుగపురుషులిట్లు సద్యఃఫలం చూడగల్గుట అరుదు. నిరంతరసాధనపరుడగు ఆయన జీవితమొక అద్భుతకళ, ఆమహా గీతంలో అపస్వరమేలేదు. ఈలోకోత్తరుడు వృద్ధుడైనకొలది లోపలి ఆత్మతేజమింకను వృద్ధిజెంది ప్రకాశమానమై మరణాం నాటికి అద్భుతకాంతితో సర్వశక్తిమయంగాఉండినది. ఏవ్యాధి లేకుండ తానుకోరినట్లే పూర్ణాహుతిగ బలిదానంకూడ జరిగి

సర్వవిధముల ధన్యతజెందినాడు. ఆమార్గమును మనమనుసరిం పకపోతేనే ఆయాత్మ ఖిన్నమగును. కనుక, ఆబోధనలను అను సరించుటే మనకర్తవ్యము.

రాజేంద్రప్రసాద్

దేహము అస్థిరం. దాని బంధంవదల్చుకొని ఎక్కువ స్వేచ్ఛతో లోకక్షేమంకల్గించుటకే ఆయాత్మ దేహమునువిడిచి యుండును. మట్టిముద్దలనే యోధులగజేసి నిరాయుధులచే సామ్రాజ్యదుర్గముల ఛేదింపజేసిన వీరాగ్రణి. భౌతికంగా కనబడకున్నను ఆయన ఆత్మసన్మార్గమును మనకు చూపుచునే యుండును. అహింస సాంఘికైక్యం స్థాపించుటకే జీవించి అందుకే ఆయనప్రాణమర్పించెను. మనము కోపం ప్రతిక్రియ మాని ఆయన అంత్యాజ్ఞగు సాంఘికసఖ్యము నమలుచేయవలె.

కిశోరీలాల్ మశ్రువాలా:-

బాపుజీ బిడ్డలము దుఃఖించుట సహజమే. ఆయనకు స్మారకములు స్థాపించుటయు జరుగును. కాని, ఆయన సిద్ధాంత ములను సంస్థలను మనము మనఃపూర్వకంగా అనుసరించి బలపర్చిననే ఆయనపేరు నిలువబెట్టి, నిజమగు అనుచరులము కాగలము.

వల్లభాయి పటేలు :-

ఇది మనకు గొప్పపరీక్షాసమయము. జన్మాంతంవరకు ఆయనచేసిన బోధనలను మనమిప్పుడు మరువక, శాంతి నిగ్రహ

వినయాలతో సవ్యంగా వాటిని ఆచరిస్తేనే ఆ ఆత్మకు తృప్తి కల్గును. మన జాతిని ఆయనకోరినట్లు దృఢంగా చేయుదుము.

డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు —

కలియుగంలో యిది పదియవ అవతారం కావచ్చు. ఈ రెండు డొమినియనులలో ధర్మ స్వరాజ్యం స్థాపింప జేయుట గాంధిగారి సంకల్పము. అయితే అది ఆయన కోరిన రూపంగా రాలేదు. పరిస్థితులు ఆయన తత్వమునకు వ్యతిరేక ముగా మారజొచ్చెను. ఇట్టి భౌతిక ప్రపంచములో తనకు స్థానం లేదనుకున్నాడు. బుద్ధుని త్యాగము, క్రీస్తు తపశ్చర్య, హరిశ్చంద్రుని సత్యపరత, రాముని పవిత్రత, కృష్ణుని రాజనీతి గాంధిలో మేళవించినవి. ఈ దేశమును ఈ లోకమును ఉద్ధ రించదలచి ముందుగా ఆయన అంతశ్శతృవులను జయించి నాడు. జీవన్ముక్తుడై హింసా యుద్ధ పీడితమగు యీ లోకము నిమిత్తము బలిదానము చేసినాడు.

లియాఖత్ ఆలీఖాన్ :-

మన కాలపు మహాపురుషుడు గాంధిగారు సాంఘిక, సఖ్యత స్థాపనకు సర్వస్వమర్పించినాడు. అహింసా ప్రవక్త జీవితము హింసకు గురియైనది. ఆహా! ఆయన జీవిత కృషి సాంఘిక ఐక్యము సఫలమగుగాక.

ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్ :-

ఈ అంధకార దినాలలో ఆయన మనకు శాంతిజ్యోతి.

నౌక్రాసీ ఫాషా :-

గాంధిమహాత్మునివంటి వ్యక్తి విశ్వజీవితములో యెప్పుడో తటస్థించును. అట్టి లోకోత్తరుని వధ నరజాతి కంతకు అపరాధము, అతిదుష్టము.

రష్యామంత్రి, గ్రోమికో :-

భారతీయుల స్వాతంత్ర్య యుద్ధ విషయములో ఆయన పేరు చిరస్థాయి యగును.

చీనాదేశపు ప్రతినిధి డాక్టరు ఇచ్చియంగ :-

ఆసియా నాయకులందరిలో ఉత్తముడు, యోగి యగు గాంధి మృతివలన ఆశియా అమూల్యరత్నమును గోల్పోయినది.

మైసూరు మహారాజు :-

గాంధీ హత్యకన్న మహానర్థకము ఉండదు. ఆయన సదాచరణ, తత్వబోధ, కుశలనేతృత్వము మనకు అనుసరణీయములు.

సర్ తేజ్ బహద్దూర్ సప్రూ :-

అందరికన్న న్యాయస్థుడు, దేశభక్తుడు, మన స్వాతంత్ర్యజనకుడు యజ్ఞాహుతి అయినందుకు మనమందరము ఆయన ఉన్నతాశయములను అనుసరింతుముగాక.

మద్రాసు గవర్నరు ఆర్చిబాల్డు నై :-

గాంధివంటి మహానాయకుడు విశ్వవంద్యుడు దొరకుట భారతదేశపు సౌభాగ్యము. ఈ ప్రస్తుత కాలములో

ఆయన సదాచరణ, సద్భావన, సమష్టతను ప్రచారము మెంతైనా అవసరము. గాంధి ఖ్యాతి సద్వర్తన ప్రసిద్ధి శాశ్వతంగా ఉండగలవు.

బీహారు గవర్నరు అణే:-

గాంధీ పోయినను మన హృదయాలలో ఉండి తీరును. ఈ జాతీయ ప్రమాదములో ఆయన బోధనలను అనుసరించుటయే మన కర్తవ్యము.

అస్సాం గవర్నరు అక్బరు హైదరీ:-

గాంధిగారు దేశజనకుడు. అసహాయుల సహాయకుడు. ఆయన బలిదానము మనకు పథప్రదర్శనము.

సర్దార్ స్వర్న సింగ్:-

భారతదేశమేగాక లోకమంతయు సర్వోత్తముడగు నైతికమూర్తిని కోల్పోయినది. ఇప్పుడే ఆయన అవశ్యకత హెచ్చుగా కలదు.

పంజాబు ముస్లింలిగు అధ్యక్షుడు మియాం ఇత్తికరుద్దీన్ :-

మహాత్ముని మృత్యువుతో గాంధి యుగమంతరించినది; కాని ఇటీవల తలయెత్తిన దుష్టశక్తులను ఆయన తేజఃకాంతులణచగలవని ఆయన పవిత్ర లక్ష్యమును మనమాచరింపగలమని నా ఆశ.

కేంద్ర పాకిస్తాన్ మంత్రి చుంద్రిగర్ :-

గాంధీజీ హత్య ఈ రెండు రాజ్యాలకు నష్టకరము. దేశంలో ఆయన కలిగించిన రాజకీయజాగృతి అద్భుతము.

ఆయన చరిత్రలో క్రాంతివీరుడు. ఉభయరాజ్యాలు ఆయన హత్యనుండి గుణపాఠము నేర్చుకొని అన్నివిధాల కులతత్వము మానవలె.

గవర్నరు జనరలు లార్డ్ మౌంటు బాటన్:—

గాంధీగారి మరణమువల్ల ఈదేశమునకేకాదు లోక మంతటికి నష్టముకలిగినది. ఆయన లోకోత్తరపురుషుడు.

శాసనసభ అధ్యక్షుడు మౌలంకర్

హంతకుడు మహారాష్ట్రుడగుట నాకు సిగ్గుచేటు. గాంధీజీ యుగపురుషులలో మహనీయుడు ఈహత్య ప్రజా తంత్రతకు మూలచ్ఛేదకము.

రాజాజీ

మనప్రియనాయకుని బలిదానంతో మనలోని యావత్తు ద్వేషము, సందేహము నశించిపోవలెను.

మౌలానా అబ్దుల్ కలాం అజాద్:—

ప్రేమమయుడగు మహాత్ముని ఆత్మార్పణ సాంఘిక మైత్రి స్థాపనకై జరిగినది. ఆయన ఖ్యాతిని శాశ్వతం చేయవలెను.

రాజకుమారి అమృతకౌరు:

మనమందరము నిజంగా ఆయనబిడ్డలము. ఆయనవలె మనమును లోకులలో క్రోధమునకుబదులు ప్రేమభావమునే ప్రసరింపజేయుదము.

వినోబా భావే:

ఆయన ప్రబోధప్రకారము మనము భాష, సాంఘిక మతవిభేదాలు వదలుకొని స్వతంత్ర హిందూస్థానములో సోద

కలుగ నడుచుకొనవలెను. మనము ఏకీభవిస్తేనే ఆయన సందేశము లోకమంతట వ్యాపించగలదు.

అ మె రి కా అ ధ్య క్షు డు ట్రూ మ న్ :

బోధకుడు నాయకుడుగా గాంధిగారిప్రభావము లోకమంతట వ్యాపించినది. ప్రపంచములో శాంతిప్రియులందరికి ఈమృతివల్ల అపారనష్టము కలిగినది. ఈసృష్టిలో ఒక పురుషోత్తముడు గతించినాడు.

బ్రి టి షు రా జు, ఆ ర వ జా ర్జి :

గాంధిగారి చావువల్ల నిజంగా నరజాతికంతకు అపారనష్టము కలిగినది.

బ్రి టి షు ప్ర ధా ని అ ట్లీ:

ఈఅద్వితీయవ్యక్తి నిధనమువల్ల అందరికి దుఃఖము కలిగినది. భారతీయ స్వాతంత్ర్యవాంఛ ఆయన వెల్లడించెను. కాని ఆయన కేవలము జాతీయవాదియేకాడు.

డి వే ల రా

ఆయన మరణానంతరము గాంధీ ప్రభావము లోకములో వ్యాపించియుండును. భారతీయులు గాంధీజీవనములో ఆనుష్ఠించిన మహాశయముల నమలుజరుపుదురని కోరిక.

# 90 సంస్థానైక్యత

మహాత్ముని ప్రేమ సందేశపు ఫలము దేశీయ రాజ్యాల విషయంలోను కనబడుచున్నది. ఆయన జన్మ, బాల్యము, ఒక సంస్థానములోనే గడచెను. బ్రిటిషు అధికారమునుండి స్వాతంత్ర్యం సంపాదించు కృషితోబాటు మహాత్ముడు సంస్థానాలలోను స్వాతంత్ర్యోద్యమమునకు తోడ్పడుచుండెను. రాజకోట సత్యాగ్రహమును లోగడ గమనించినాము. బ్రిటిషు ఆధిపత్యము సీదాగా పోతేనే ఈ సంస్థానరాజులు ధర్మకర్తలుగ వర్తించి, ప్రజాయత్తపాలన పెట్టుదురని ఆయన గ్రహించెను. అయితే 15-8-47 తరువాత బ్రిటిషువారు తమ పారమౌంట్సీ (ఆధిపత్యం) పోయినను, అది భారత డొమినియను సర్కారుకు సంక్రమించక ఆ యా సంస్థానాలలోకే చేరినదని చెప్పిరి. ఈ కిటుకు అన్యాయము. అదిగాక సంస్థానాలలోను అంత్యాధికార మీకాలంలో ప్రజలకు చేరక తప్పదు; కనుక సంస్థానాలలో ప్రజాయత్తరాజ్యం స్థాపించి అట్టి మంత్రుల సలహా ప్రకారమే రాజులు నడుచుకోవలె. సుమారు 560 స్వతంత్ర రాజ్యాలీభారత మధ్యమందు స్వతంత్రంగా నిరంకుశపాలనలో నుండుట చాల చిక్కులకు కారణమయినది. గాంధీగారి ప్రేమతత్వంవల్ల చాలమంది సంస్థానరాజుల కాయనయందు విశేషగౌరవ మేర్పడినది. ఆయన సూచన ప్రకారం చాల రాజ్యాలలో అనేక మంది రాజులు కాలానుసారంగా

ఎన్నికలద్వారా ప్రజాయత్తమంత్రిమండలులు స్థాపించినారు. దాదాపు ఆ రాజులందరు (1) దేశరక్షణ (2) విదేశాంగనీతి (3) రాకపోకలు వీటి విషయాలు మన కేంద్రరాజ్యమున కధీనం చేసినారు. ఈ దేశీయ రాజ్యశాఖను కేంద్రప్రభుత్వంలో గాంధి శిష్యుడు పటేలుగా రిప్పుడు వ్యవహరించుచున్నారు.

ఈ 560 సంస్థానాలలో కొన్ని మరీచిన్నవి. అట్టివి కొన్ని చుట్టునున్న రాష్ట్రాలలో భాగంగా కలియుటకు, ఆ రాజ్యాలకు తగు పెన్షను నిచ్చుటకు నిర్ణయమైనది. ఈరీతిగా ఒరిస్సాలో కొన్ని, బొంబాయిలో కొన్ని, మధ్యరాష్ట్రాలలో కొన్నియు కలిసినవి. ఈ పద్ధతిని యిటీవలనే పుదుకోట, బంగనపల్లి రాజ్యాలు మనమద్రాసులో చేరినవి. మూడవది సండూరుగూడ త్వరలో చేరవలె. కొన్ని రాజ్యాలు సమీపస్థ రాజ్యముతో మిళితమగు పద్ధతియు వచ్చినది. ఈరీతిగ గాంధి జన్మప్రాంతమగు కాతియవాడలోని రాజకోట, భావనగరు, నవానగరు, పోరుబందరు మున్నగు దాదాపు 300 రాజ్యాలు మిళితమయి 'సౌరాష్ట్ర'రాజ్య మేర్పడినది. వీటి సమిష్టిపాలన ప్రజాయత్త మగును. ఎన్నికలో ప్రతినిధులగు వారినుండి మంత్రు లేర్పడుదురు, రాజవర్గంలోను రాజప్రముఖుడు, ఉపప్రముఖుడు ఎన్నుకోబడి బ్రిటిషురాజువలె గౌరవపదవిలోమాత్ర ముందురు. ఇట్లే ఇతర ప్రాంతాలలోను కొన్ని రాజ్యాల సంయోగంద్వారా మత్స్యప్రదేశ్, మాళవప్రదేశ్,

వింధ్యప్రదేశ్, హిమాచలప్రదేశ్, రాజస్థాన్, ఇట్టి రాజ్య వర్గములు కలసి యేర్పడుచున్నవి. ఈ పద్ధతులవల్ల రాజుల నిరంకుశపాలన నశించును; వారి గౌరవమునకు ఖర్చుకు కొంత రాబడియు మిగిలియుండును. పాలన ప్రజాయత్తము. వీరు అందరు భారత ప్రభుత్వమున కనుకూలురై యుందురు. ఆయా రాజ్యాలమధ్య శాయరు, సుంకములు, నిరోధాలును, చట్టాల సంఘర్షణము నుండవు. పరస్పర వ్యాపారము, పరిశ్రమలు ధారాళముగ సాగును. సంయుక్తపద్ధతిద్వారా పరిపాలన పద్ధతియు చాల బాగుపడి, న్యాయము సిద్ధించును. ఈ వర్గీకరణంవల్ల మొత్తం సంస్థానాలన్ని కలిసి షుమారు 25 మాత్ర ముండును. వాటిలో మైసూరు, తిరువాన్కూరువంటి పెద్ద రాజ్యాలు విడిగనేయున్నను వాటిలోను ప్రజాయత్తత, భారత రాజ్యంతో సంయుక్తతయు కల్గినవి. ఈ రీతిగ విశేషసంఘర్షం లేకుండ త్వరలోనే సంస్థానవిభేదాలు పోయి, మైత్రితోనే సమన్వయము కల్గినది. గాంధిమహాత్ముని ప్రేమ మైత్రితత్వ మవలంబించుటవల్ల ఉభయత్ర స్నేహభావంతో కొద్దినెలల లోనే పరిష్కారమైనది. వీటిలో రెండుమాత్రం మిగిలినవి. వీటిలో కాశ్మీరము చరమావస్థలో భారతరాజ్యంతో సంబద్ధమైనది; ఈలోగా తీవ్రంగా ఆరంభించిన పఠాను పాకిస్తానుల దాడియుద్ధ మింకను సాగుచున్నది. ఇందులో పాకిస్తాను న్యాయశాస్త్రవిరుద్ధంగా పఠానుదండుకు తోడ్పడుచున్నందున

సంయుక్తరాజ్యసమితి వారి పరిష్కారమున కీసమస్య పంప బడినది. ఆ సమితివారు న్యాయం తేల్చుటకు మొదట ఎట్లు తేల్చితే అంతర్జాతీయంగా ఆంగ్ల - అమెరికన్ మిత్రులకు లాభకరమగునో అని గుటకలువేయుచు 3 నెల లయినను ఏమీ నిర్ణయించ లేదు. ఈలోగా కాశ్మీరపు గిరిగహనములలో మన భారత కాశ్మీర సేనలు శత్రుసేనలతో పోరుచు ఆ కొండ మన్య ప్రాంతాలలో క్రమక్రమంగా జయమొందుచున్నారు. కొండజనులు పాకిస్తానీయులు ఇంకను దండెత్తి వచ్చుచున్నను, నెట్టివేయుచున్నారు. కానిస్థిరమగు రాజకీయజయము హిందూ ముస్లిం మైత్రిద్వారాలభించును. మతావేశము పోవుట పైని కంగా రాజకీయంగా గూడ మనకు జయకరమగును. కాశ్మీర నాయకుడు షేక్ అబ్దుల్లా జాతీయధోరణిగలవాడు. ఇక హైదరాబాదురాజ్యము. ఇది భారతగర్భంలోనున్నది. దీని జనసంఖ్యారాబడి తక్కిన అన్నిసంస్థానాలలోకన్న గొప్పది. ఇక్కడి రాజగు నిజాముపాలకప్రముఖులు ముస్లిములు. ప్రజలునూటికి 85 హిందువులు. వారు తక్కిన వాటివలెకోరినను, రాజు నిజాం భారతరాజ్యంతో సంబద్ధతకిష్టపడక, తమ స్వాతంత్రత గుర్తించి మైత్రి సంధిచేసుకొందుననుచున్నాడు. అది యెట్లున్నను తనకనుబంధులై ఇత్తిహాదుల్ ముస్లిమీన్ మూర్ఖ సాంఘికతత్వపు మతావారు సాయుధులై ప్రజలపైన దౌర్జన్యము సాగించుచున్నందున అక్కడి స్టేట్ కాంగ్రెస్ వారు

గాంధీతత్వప్రకారం సత్యాగ్రహం సాగిస్తున్నారు. ఈలోగా ఇదేసందుఅని కమ్యూనిష్టులు జనసామాన్యంలో పలుకుబడి సంపాదించి ఆయుధాలతో విప్లవచర్యలు సాగించుచున్నారు. ఈపక్షాలమధ్య తీవ్రసంఘర్షంలో ప్రజలు నలగిపోవుచు ముఖ్యంగా సరిహద్దుజిల్లాలవారెక్కువ బాధపడుచున్నారు. నిరంకుశపాలన పద్ధతిమాని వెంటనే హైదరాబాదులోను ఆధునికపద్ధతిని ఎన్నికలుసాగించి ప్రజాయత్తత నేర్పర్చి వారిప్రతినిధులతో మంత్రిమండలి నిర్మింపుమని సాంఘికదౌర్జన్యాలు సాగించు ఇత్తిహాద్‌లను తొలగించవలెనని కేంద్రప్రభుత్వంవారు తొందరజేయుచుచున్నారు. ఈ యిత్తిహాదుపక్షపు దౌర్జన్యచర్యలు కొంత నిజంకావని కొంత కమ్యూనిష్టుల దుశ్చర్యలనుండి దేశరక్షణ జేయునవని నిజాంప్రభుత్వం సాకు చెప్పుచున్నారు. ఆంధ్రులకెక్కువసంబంధించిన ముఖ్యసమస్య త్వరలోనే సవ్యంగా పరిష్కారంకావలసియున్నది. ఇక్కడను సాంఘిక మైత్రియేర్పడితే ఈ సమస్య త్వరలో సులభంగా పరిష్కారమగును. ప్రస్తుతం 40 లక్షలజనాభాగల హరిజనులను తమకనుకూలంగా ఆకర్షించియు ముస్లింసాంఘికతత్వమును రేపియు అనువంశిక జాగీర్దారుల సాయంతోను తన నిరంకుశాధికారమును స్థిరపర్చుకొనుటకు నిజాంప్రభుత్వము యత్నించుట సహజము. గాంధిగారి హరిజనోద్ధరణకృషివల్ల నిజాంరాజ్యంలోను ఇటీవల హరిజన

ప్రముఖులు జాతీయదృక్పథముకు వచ్చుచున్నారు. కాని హింసాసంఘము హరిజనుల అస్పృశ్యతాబాధను ఆర్థిక దుస్థితిని వెంటనేతొలగించితేనే సంఘటనమేర్పడును; హిందూ ముస్లిము సాంఘిక సఖ్యమునకిది సహాయకారి. ఈసాంఘిక మైత్రి సామాన్యులలో నాటుకొంటే, ఇత్తెహాదుపక్షముకు బలము ప్రాబల్యము తగ్గిపోవును. భారతీయముస్లిములును నిజాంధోరణిని నిరసించి, ప్రజోద్యమమునే హర్షింతురు. ఆ స్థితిలో అరిష్టకరమగు రక్తపాతయుద్ధమక్కరలేకయే నిజాం ప్రభుత్వమును ప్రజావాంఛకు లొంగకతప్పదు.

# 91 స ర్వో ద య ము

ఇప్పుడు మూడవ ప్రపంచయుద్ధము త్వరలో వచ్చునని ముఖ్యరాజ్యప్రముఖులు అసురత్వంతో తమ ప్రజలను మరల ఆహుతికి తయారుచేయుచున్నారు. అట్టియుద్ధమేవస్తే ఈఆటం బాంబు విశ్వకిరణ క్రిమివిషప్రయోగాలవల్ల కలిగే అనర్థాలకు మితియుండదు. ఇందులో భౌతికహానికన్నను నైతికహాని చాలహెచ్చును. అట్టిప్రమాదమునుండి లోకమును తప్పించుటకు గాంధితత్వమే ఆధారము. కనుక మన జాతీయలాభమునకును, లోకక్షేమమునకునుగూడ గాంధివాఙ్మయమును సరిగా సేకరించి ముఖ్యభాషలన్నిటిలో ప్రచురించుటకును గాంధి సంస్థలను పోషించుటకు ఈకార్యాలకు తగు నిధిని వసూలు చేయుటకుగూడ కాంగ్రెసు సంఘమ్ వారు తీర్మానించినారు.

గాంధిగారి అహింసాతత్వము నందరికి జ్ఞప్తికి తెచ్చుటకు బొంబాయివద్ద సముద్రిందగ్గర పీఠస్థలముమీద 79 అడుగులయెత్తు గాంధివిగ్రహమును, చుట్టు 79 స్థంభములు స్థాపించ నిర్ణయమయినది. ఇట్లే ఆసిద్ధాంత ప్రచారమునకై ద్రవ్యనిధి వసూలు చేయుటకు ఇప్పటి కాంగ్రెసుకు, రాజ్యాంగ నిర్మాణ పరిషత్తుకు అధ్యక్షుడగు రాజేంద్రప్రసాదుగారి అధ్యక్షతను ప్రత్యేక సమితి యేర్పడినది. ఈమహానిధికి రాజులు, పూంజీపతులు, మధ్యతరగతులవారు, కార్మికకర్షకులు ఇట్లు అందరు గూడ యథాశక్తిగా చందాలిచ్చుచున్నారు. చాల కోట్ల రూపాయల నిధి వసూలగును. అధనముతో గాంధిస్మారకంగా వాఙ్మయప్రచురణయేగాక ఆయననిర్మించిన నిర్మాణ కార్యసంస్థలన్నింటిని బలపర్చి పోషించవలె. ఈమహాసంస్థలన్నియు గాంధిమహాత్ముని బిడ్డలవంటివే, ఆయనకు స్మారకచిహ్నలే. మార్చి 13,14,15 తేదీలలో నిర్మాణ కార్యపరులందరును సేవాగ్రామంలో సమావేశమయి గాంధితత్వమును చిరస్థాయిగ జేయుటకు సంప్రదించి చర్చలుసాగించినారు.

గాంధిసిద్ధాంతముల నాచరణలో పెట్టుటకు లోగడ యేర్పడి పనిచేయుచుండిన గాంధిసేవాసంఘవు ప్రముఖులు ధోత్రే వినోబాభావే, నెహ్రూ, మష్రువాలా, జాజూ ఇత్యాది గాంధిశిష్యులు అనుభవాధారమగు తమ సూచనల జేసిన మీదట కొన్నినిర్ణయములు జరిగినవి. ఇంతవరకు సాగుచున్న

చరఖాసంఘం, గ్రామపరిశ్రమసంఘం, తాలిమీసంఘం, గోసేవాసంఘం, హరిజన సేవాసంఘాలన్నిటిని సంఘటితం చేసి నిర్మాణకార్యములను సమన్వయించి సాగించుటకు నిశ్చయించినారు. ఇందులో అభిమానంకలిగి యీకార్యంసాగించ దీక్షవహించువారు 'సర్వోదయసమాజం' అని యేర్పడ నిశ్చయించినారు. దానికిని డా. రాజేంద్రప్రసాదుగారధ్యక్షులుగ నుందురు. వీరందరు సర్వోదయముకు జనులందరిక్షేమపు విశాలదృక్పథంతో వర్తింపవలె.

సర్వోదయ సమాజం పుట్టుపూర్వోత్తరాలను గురించి శ్రీ రాజేంద్రప్రసాదుగారు హరిజన్ పత్రికలో వ్రాసిన వ్యాసము క్రింద పొందుపరుపబడుచున్నది.

# 92 వార్ధా సభ

నిర్మాణకార్యక్రమములోని పలువిధములైన కార్యకలాపములను కొనసాగించుచుండిన ప్రచారకులు తమకుగల అనుభవములను అభిప్రాయములను పరస్పరముగా తెలియజెప్పుకొనుటకున్నూ నూతన పరిస్థితులలో తమ కార్యక్రమమును ప్రశస్తముగా కొనసాగించుటకు అనువైన మార్గముల గూర్చి ఆలోచించుటకున్నూ ఒక సభను జరుపుట అత్యవసరమని తలంచుచుండిరి. ఈ సభను ఫిబ్రవరి మాసములో వార్ధా నగరమందు జరుపవలెనని గాంధీజీతో సంప్రతించిన పిమ్మట

నిర్ణయింపబడెను. గాంధీజీ యీ సభకు హాజరగు నిమిత్తము ఇంకా రెండుమూడు రోజులలో ఢిల్లీనుండి బయలుదేరవలెనని సంకల్పించియుండగా ఘోరవిషాదము సంభవించెను. అంతటితో వార్ధాసభ సమావేశము నిలిపివేయబడెను.

గాంధీజీ మరణానంతరముయీ సమావేశావశ్యకత మరింత ఎక్కువగా కన్పించెను. అందువల్ల మార్చి 13, 14, 15 తేదీలయందు అది సమావేశపరచబడెను. దేశములలోని అనేక ప్రాంతములనుండి సుమారు 500 ప్రచారకులు విచ్చేసిరి. అంతేగాక పండిత నెహ్రూ, మౌలానా ఆజాదు, రాజకుమారీ అమృతకౌరు, జయరామదాస్ దౌలతరామ్‌గార్లన్ను (ఇండియాప్రభుత్వ మంత్రులు) మధ్యపరగణాలు, ఒరిస్సాల గవర్నలున్నూ బొంబాయి, మద్రాసు, ఒరిస్సా రాష్ట్రముల ప్రధానమంత్రులున్నూ ఇతరరాష్ట్రమంత్రులు కొందరును ఆచార్య కృపలానీ, జయప్రకాశ నారాయణ మున్నగు ప్రముఖనాయకులు సభకు విచ్చేసిరి.

## రెండు ముఖ్యసమస్యలు

ఈ మహాసభ ముఖ్యమైన రెండు సమస్యలనుగూర్చి చర్చించవలసియున్నది. గాంధీజీ 50 సంవత్సరముల కాలము నిరంతరంగా దక్షిణాఫ్రికాలోను భారతదేశంలోను కృషి చేసెను. ఆయన ఒక ప్రత్యేక జీవితపద్ధతిని అనుసరించెను. దేశస్వాతంత్ర్యమును సాధించుటకొరకై భారతజాతియందుగల

శక్తి సంపదను సంఘటితమొనర్చెను. ఆయనసాగించిన పోరాటము క్రొత్తపద్ధతి ననుసరించినదైయుండెను. సత్యము అహింస యనెడి రెండు ధర్మములను తన సాధనముగా స్వీకరించి ఆయుధబలముతో కూడిన ఒక బ్రహ్మాండమైన రాజ్యమును ఎదిరించెను. ప్రపంచముతో నిమిత్తములేకుండా సర్వసంగ పరిత్యాగియైన వారికిమాత్రమే ఆచరణీయమైన ఉపదేశముల వంటివి ఆయనబోధించిన ధర్మసూత్రములుకావు. ప్రతివాడును తన నిత్యకృత్యజీవితములో అనుష్ఠించదగిన పద్ధతులనే ఆయన బోధించెను. ఆయనజీవితములో ఆయనబోధించిన విషయము లన్నియు అనంతర పురుషాంతరములవారికి లభ్యమగునట్లుగా ఆయన వచనరచనలన్నియు భద్రపరుపబడినవి.

వార్ధాలో సభ సమావేశమగుటకు ముందుగా మార్చి 13 తేదీన నిర్మాణ కార్యప్రచారకులలో ముఖ్యులు కొందరు కలిసి వివిధ విషయములను చర్చించి సభా కార్యక్రమమును నిర్ణయించిరి. సభలో ప్రతిపాదింపబడు నిమిత్తమై ఒక చిత్తు తీర్మానమునుగూడా తయారుచేసిరి. ఈప్రారంభ చర్చలకు హాజరైనవారందరును ప్రతి విషయమును నిష్కపటముగా సాంగోపాంగముగా చర్చించిరి. గాంధిమహాత్ముని బోధలును ఉపదేశములను ప్రజలు పఠించుటకును అనుసరించినట్లుగా చేయుటకును మనము ఏవిధముగా కృషిచేయవలెను? అందుకొరకు ఒక ప్రత్యేకసంస్థయొకటి ఉండవలెనా?

అట్టిసంస్థలో పనిచేయువారు కొన్ని క్రమశిక్షణ నియమము లకులోబడికట్టుదిట్టమైన సంఘమువలె పనిచేయవలెనా? ఆరీతిగా గాక, మహాత్ముని ఉపదేశములయందు నమ్మకము గలవా రందరును తమ సొంతజీవితములందు వాటిని యథాశక్తిగా అనుసరించుచు తమవలెనే మహాత్ముని ఉపదేశములను నమ్మి యనుసరించుచుండెడి తదితరులతో కలసి ఒక వర్గముగా అట్టి వారు చేరియుండిన చాలునా? అను విషయముల గురించి చర్చించిరి.

## గాంధీ విధానము

గాంధీమహాత్ముడు జీవించియున్నకాలములో ఆయన ఉపన్యాసములలోను ఆయన వ్రాతలలోను ప్రజా జీవితమునకు సంబంధించిన అనేక విషయములను ఆయన ప్రస్తావించియుండెను. ఆయన చర్చించియుండని విషయము లేదని చెప్ప వచ్చును. ప్రభుత్వ వ్యవహార సమస్యలు మొదలుకొని వంట యింటి విషయాలు, పాయఖానాల పరిశుభ్రము చేయుటను గూర్చిన విషయాలు సత్యజీవితమునకు సంబంధించిన అత్యల్ప విషయాలుకూడా ఆయన పరిశీలించియుండెను. ఆయనకు బ్రహ్మాండమైన విషయమనేదే లేదు. అత్యల్పమైన విషయమనేదీ లేదు. స్వల్పవిషయమని భావించి తృణీకరించినదిన్నీ లేదు.

ఆయన జీవితమంతయును సత్యపరిశోధనతో గడచెను. అందుచేతనే ఆయన తన స్వీయచరిత్ర గ్రంథమునకు "సత్యా

న్వేషణము" అని నామకరణము చేసెను. ఈ దేశానికి ప్రపంచానికి సంబంధించిన సాంఘిక, రాజకీయ ఆర్థిక సమస్యల నన్నింటిని పరిష్కరించుటకు ఆయన సిద్ధాంతములను ఏరీతిగా వర్తింపజేయవలెనో విశదీకరించుచు కూలంకషమైన పాఠ్య గ్రంథము నొకదానిని రచింపవలసినదిగా ఆయనను కొందరు కోరియుండిరి. ఆ యా సందర్భావసరములనుబట్టి తన మూల సిద్ధాంతములను తాను వర్తింపజేయుచు ధర్మసాధన చేయుచున్నాననియు గాంధి సిద్ధాంతభాష్యము నొకటి సమగ్ర గ్రంథముగా వ్రాయజాలననియు ఆయన చెప్పెను. కాబట్టి స్థిరసిద్ధాంత ప్రమాణసూత్రములను బాహుళ్యముగా నిర్వచించుచు పాఠ్యగ్రంథమువలె రచించుట ఆయన అభిమతము కాదు. కనుక ఆయన జీవితానంతరముకూడా అట్టి గ్రంథరచన చేయుటకు మనము పూనుకొన వీలులేదు. కొంతకాలము గడచినతర్వాత గాంధి పద్ధతుల ననుసరించెడివారు ప్రత్యేకించి గాంధి సాంప్రదాయములోనివారని పిలువబడుచు ఒక ప్రత్యేక శాఖగా ఏర్పడుట సంభవించవచ్చును. ఒక ప్రత్యేక సంఘము నేర్పాటుచేసినయెడల అటువంటి పరిస్థితి ఏర్పడవచ్చునని కొందరికి అనుమానము కలదు.

# సత్యానుష్ఠానం

గాంధిజీ అలౌకిక్యుడు కాడు. ఆధ్యాత్మిక వేదాంత విషయములతో ప్రత్యక్ష ప్రపంచమునకు సంబంధము లేకుండా మాట్లాడేవాడు కాడు. మానవులయొక్కయు సంఘము యొక్కయు నిత్యకృత్య జీవితములో అనుష్ఠించుటకు తన పవిత్ర సిద్ధాంతములను సుసాధ్యమైనవనియు అనుష్ఠింపవలె ననియు ఆయన బోధించెను. సత్యము, అహింస ఇవి రెండును ఆయన మూలసూత్రములు. వాటిని జీవితములో వర్తింప జేయుటకొరకే ఆయన నిర్మాణ కార్యక్రమము నొకదానిని నిరూపించెను. అహింసకూడా సత్యముయొక్క అంశాభేదమే, రూపాంతరమే గాని మరొకటి కాదని ఆయన నిరూపించెను. కనుక "సత్యం" అనునది ఒక్కటే ప్రధాన ధర్మ సూత్రముగా ఆయన అవలంబించెను. ఆయనకు సత్యమే భగవత్స్వరూపము. మానవసంఘము సత్యము నాశ్రయించుకొని వర్తించనియెడల దానికి సార్థకత లేదు. కాబట్టి మానవుడున్ను మానవసంఘమున్ను ఆయన కోరిన పరిపక్వదశను పొంది ఉన్నతస్థితికి రాగలందులకై ఆయన తన నిర్మాణ కార్యక్రమ విధానమును నిరూపించెను. మోక్షమునకు అనేక సాధనోపాయములు అనేక మార్గములు ఉన్నట్లుగానే, మానవులు సంపూర్ణమైన ఆత్మవిశ్వాసమును పొందగల్గుటకు వేర్వేరు కర్మానుష్ఠానములను ఆయన తన నిర్మాణ కార్యక్రి

వములో సూచించియుండెను. కేవలము బుద్ధిసామర్థ్యముచేత ఏకాగ్రచిత్తతవల్ల జ్ఞానగరిష్ఠుడై మైకమనెడి ఆత్మసంతృప్తి చెందుటవల్ల ప్రయోజనము లేదనియు, నిత్యజీవితములోని మన ప్రవర్తనయందు అనుష్ఠింపదగిన కార్యక్రమము మూలముగా మనకు ఆత్మసంస్కారము కలుగవలెనని ఆయన నిర్ణ యించెను. కనుక, ఆయన నిర్వచించిన సిద్ధాంతములను ఏకరీతిగా ప్రవర్తింపజేయవలెననే విషయమును చర్చింపవలసి యున్నది.

## నిర్నిబంధ సంస్థ

మానవులు మనస్ఫూర్తిగా అంతరాత్మప్రబోధితులై ఏ ధర్మమార్గమునైనను అనుసరించవలెనుగాని, బాహ్య నిబంధనలకు నిర్బంధములకు లోబడి అనుసరింపరాదని గాంధిజీ అభిమతము. బాహ్యనిబంధనలకు చట్టములకుమాత్రమే బద్ధులై ప్రవర్తించెడివారు ఒకవిధంగా ఆత్మవిశ్వాసములకు వ్యతిరేకంగా ప్రవర్తించినవారగుదురు. ఆయన జీవించియున్నంత కాలము ఆయనయొక్క మూర్తియే కొందరిని ఏకకూటంగా ఆకర్షించియుండినయెడల ఆ భౌతికమూర్తి, ఆ భౌతికస్వరూపము అగ్నికి ఆహుతియైపోయినది. గనుక ఆయన ఉపదేశానువర్తనులైనవారందరును చెల్లాచెదరై పోవుట సంభవించును. అందువల్ల అట్టి గాంధి ధర్మానుచరులనందరిని ఏకముఖముగా నాకర్షింపగల్గుటకై మధ్యమార్గము నొకదానిని అనుసరింప

నిశ్చయించితిమి. యథాశక్తిగా గాంధి ఉపదేశములను అనుసరించుచున్నవారు కలరు. అట్టివారి నందరిని సమాకర్షించుటకు ఒక ఐచ్ఛికసంఘము నేర్పాటు చేయదలచిరి.

అట్టి సంఘము నొకదానిని ఏర్పాటుచేసేయెడల ఆ సంఘములో చేరువారికి సభ్యత్వమనేది ఏదైనా ఉండును అట్టి సభ్యత్వమునకు పరతు నియమము లేనైనా ఉండును. సభ్యుల జాబితా, అనేది ఏదైనా ఉన్నయెడల సభ్యులుగా చేరెడివానికి తగిన యోగ్యతార్హతలు కలవా యనెడి సమస్య బయలుదేరును. కనుక సభ్యుల జాబితా అనవసరమని భావింపబడినది. కాని, ఏ స్వల్ప బాధ్యతలతోనో సభ్యత్వమనేది ఉండవలెననియు సభ్యులజాబితా యొకటి యుండవలెననియు మరికొందరు వాదించిరి. కనుక, గాంధిధర్మోపదేశములయందు నమ్మకము కలవారును, అట్టి ధర్మోపదేశములను తమ జీవితములో అనుష్ఠింపదలచువారును, నిర్మాణకార్యక్రమమును సాగించుటకై ప్రతిష్ఠింపబడిన వివిధసంస్థలును, మున్ముందు ప్రతిష్ఠింపబడగల సంస్థలను కొనసాగింప బూనుకొను కార్యక్రమములను అనుసరింపదలంచు వారును యీ సహచర వర్గములో చేరుటకు అర్హులైయుందురు. కాబట్టి యిందులో చేరుటకు అర్హుడనని భావించెడి ప్రతివారును యిందులో చేరుటకు తన దరఖాస్తును పంపుకొనవచ్చును. అట్టివాని దరఖాస్తును స్వీకరించి నమోదు చేయుటకు అధికార మొసంగబడిన వానికి

పంపుకొనవచ్చును. సభ్యుడు అనిగాని "సభ్యత్వ" మనిగాని నామకరణము చేయక "సేవకుడు" అనిగాని "సాధకుడు" అని గాని "ప్రచారకుడు" అనిగాని అట్టి దరఖాస్తుదారు వ్యవహరింపబడును.

## నా మ క ర ణ ము

దీనికి "సంఘము" అనేపేరు నర్దింపబడెను. కొన్ని నియమ నిబంధనలు కలదే సంఘమనిపించుకొనును, నిర్నిబంధమైన కూటమగుటవల్ల దీనిని "సమాజము" అని వ్యవహరింప దలంచితిమి. ఈ విషయమై కొంత చర్చ జరిగినపిమ్మట దీనికి "సర్వోదయ సమాజము" అని నామకరణము చేయబడెను. "సర్వోదయ" అను శబ్దమును గాంధిమహాత్మ ప్రయోగించిడేయుండెను. తనఉపదేశములఫలితము"సర్వోదయ"మని గాంధీజీ చెప్పుచుండెడివారు. గాంధీజీ ఉపదేశముల అనుష్ఠానభాగమును నిర్మాణ కార్యక్రమ సేవకులు జ్ఞప్తియందుంచుకొనుటకు యీ పేరు తగియున్నది. జాతి మత కుల విభేదము లేకుండ వ్యక్తులు వర్గములుకూడా అభివృద్ధిలోనికి వచ్చుటకై సమానావకాశములను కల్గించేటటువంటిన్ని పరస్పర పీడనకు వంచనకు అవకాశము లేనటువంటిన్ని సాంఘిక వ్యవస్థను అహింసాసత్యము లనెడి ధర్మసూత్రముల ననుసరించి ఏర్పాటు చేయు నిమిత్తమై కృషిచేయుటకు యీ సర్వోదయ సమాజము ప్రతిష్ఠించడమైనదని తీర్మానములో చేర్పబడెను. నిర్మాణకార్య

క్రమములో చేరియుండెడి వేర్వేరు కార్యకలాపములు యీ తీర్మానములో పేర్కొనబడెను. ఈ సిద్ధాంతములను ఆమోదించ ఎవరైతే తమకుతాము నిశ్చయించుకొందురో అట్టివారందరు యీ సమాజములో సభ్యులుగా చేరుటకు అర్హులగుదురు.

## వార్షిక సమావేశము

దీనిలో చేరినవారందరును సమావేశమగు నిమిత్తము ప్రతిసంవత్సరము జనవరి 30 తేదీని ముందుగా నిర్ణయించుకో బడు నొక ప్రాంతంలో సమ్మేళనము జరుగవలెను. ఇది కాంగ్రెసు మహాసభవలె జరుగదు. సమ్మేళనమునకు వచ్చెడి ప్రతినిధులకు వసతి సౌకర్యములను ఏర్పాటు చేయుటకు విశేషంగా ద్రవ్యం ఖర్చుచేసి ఆహ్వాన సంఘంవారు ఏర్పాట్లు చేయరు.

ఈ సమ్మేళనమునకు వచ్చేవారు, ఎవరి వసతులకువారే ఏర్పాట్లు చేసుకోవలెను. వారికోసం ఇతరులు చేయగల్గిన సౌకర్యములు పారిశుద్ధ్యాది సౌకర్యములు మాత్రమే. ఇచ్చటికి వచ్చినవారు తమ స్వానుభవములనుగూర్చి తెలియ చెప్పుకో వచ్చును. వారివారి అభిప్రాయములను తెలియజేసెడి వ్యాసములను వ్రాసి ప్రకటింపవచ్చును.

## కమిటీ

పైజెప్పిన తీర్మానమును అమలుపరచు నిమిత్తము ఒక కమిటీని ఏర్పాటు చేయవలసినదిగా ప్రెసిడెంటుకు శ్రీ కిశోరిలాలు మష్రువాలాగారికి అధికార మివ్వబడెను. గాంధీజీ ఉపదేశములకు అధికార ప్రమాణముగా అర్థము చెప్పగల గురుపీఠముగా యీ కమిటీని పరిగణించరాదు. ఉపదేశము లన్వయించుటలో కలిగెడి వివాదములకు యీ కమిటీ తీర్పు చెప్పగలదని భావించగూడదు. ఈ సమాజ మును ఒక ప్రత్యేక మతశాఖవలెగాని రాజకీయ పక్షమువలె గాని తయారు చేయకూడదు. ఈ సమాజముగాని ఈ కమిటీ గాని అట్టి పని చేయకూడదని ఏకగ్రీవంగా ఆమోదింపబడెను. సేవకులుగా చేరెడివారి రిజష్టరుమాత్రము యీ కమిటీ తయారు చేయగలదు. వార్షిక సమ్మేళనము ఎప్పుడు జరుగ వలెనో యీ కమిటీ నిర్ణయించును వేర్వేరు ప్రాంతాలలో ఉండే మెంబర్లకందరకు యీ కమిటీ అనుసంధానకర్తగ నుండును.

## సర్వోదయ సమాజము

ఈ సర్వోదయ సమాజము ప్రత్యేకంగా ఒక సంస్థ వలె వ్యవహరించును. కాని దానిలో చేరిన సభ్యులందరును నిర్మాణకార్యక్రమము నిమిత్తమై తమశక్తికొలది కృషి చేయగలరని ఊహించబడును. ప్రతిసభ్యుడు తనకుసాధ్యమైన

కార్యక్రమమును మహాత్ముని ఉపదేశముల కనుగుణముగా నిర్వర్తించు చుండవలె. కాని, యీసమాజము పేరుతోగాని యీసమాజము తరఫునగాని అతడు నిర్వర్తించునది ఏమీ ఉండదు.

ఈ సమాజములో చేరెడివారు ప్రపంచమంతటను విస్తరించి యుండగలరు. అట్టిసందర్భములో ఈ సభ్యులసంఖ్య చాలాహెచ్చుగా నుండగలదు. ఈసమాజసభ్యులద్వారా మహాత్ముడిచ్చిన జ్ఞానజ్యోతి ఖండాంతరములందును ప్రకాశ మానముగా వెల్గొందగలదు.

చర్చింపబడిన విషయములలో రెండవది ఏదనగా అఖిలభారత చర్ఖాసంఘము గ్రామోద్యోగ సంఘము, హిందుస్తానీ తాలిమీసంఘము, గోసేవాసంఘము, హిందుస్తానీ ప్రచార సభ మొదలైనసంఘము లనేకములు నిర్మాణకార్యక్రమమును కొనసాగించుచున్నవి. ఇట్టి వివిధ సంఘములతో కలిసి యీసమాజము ఎంతవరకు పనిచేయవలయును అనేవిషయము చర్చింపబడెను. ఈసంఘములు కాంగ్రెసుయొక్క ఆదరాభిమానములతో గాంధిమహాత్మునిచే ప్రతిష్ఠింపబడెను. ఇటువంటి సంఘములలోచేరి పనిచేయగోరువారు చాలామంది ఉన్నారు. అట్టివారినందరిని ఏకముఖముగా సమకూర్చుటకు ప్రయత్నించవలెనని గాంధీజీ కోరెను. పైజెప్పిన సంస్థలకు పెక్కింటికి గాంధీజీ ప్రెసిడెంటుగా నుండెను. ఆయన ప్రోసి

డెంటుగా లేనిసంస్థలనుకూడా ఆయన తన సదుపదేశములతోను సలహాలతోను నడిపించుచునేయుండెను. ఈసంస్థలన్నియు పరస్పర సహాకారముతో పనిచేయగల్గుటకును, ఈసంస్థలలో కొందరు నిర్వాహకులను నియమించుటకు, యీసంస్థలను గాంధీజీ నడిపించుచున్నట్లుగా నడిపించుట కొకసంస్థను ఏర్పాటుచేయవలెను. గాంధీజీమరణానంతరము ఇది అత్యంతావశ్యకము.

ఈసంస్థలలో ప్రతిసంస్థయును దేనికది స్వతంత్రంగా వ్యవహరించుచున్నదగుటచేత, వీనినన్నింటిని ఒక కేంద్రాధికారముక్రింద బంధించియుంచుటకు ఈసభవారు ఏవిధమైన నిర్ణయము చేయలేకపోయిరి. కాని యీసంస్థల తరఫున ప్రతినిధులు చాలమంది యీసభకువచ్చిరి. ఈసంస్థలన్నింటిని ఏకముఖముగా నడిపించగల కేంద్రపీఠమొకటి యుండవలెనని మాత్రము ఆప్రతినిధులు కోరిరి. కాబట్టి ఈసంస్థలన్నింటితో కలిసి సంప్రదించి అట్టికేంద్రాధికారపీఠము నొకటి ఏర్పాటు చేయుటకు జె. సి. కుమారప్ప గారిని నియమించడమైనది.

నిర్మాణకార్యక్రమమనునది కాలముగడచినకొలదిఅంతకంతకు బహుముఖములుగా విస్తరించునట్టిదైయున్నది. అందువల్ల ఉత్తరోత్తరా ఇంకా అనేకసంస్థలు ఏర్పడవచ్చును. కాబట్టి ఒక కేంద్రసంస్థఏర్పడేయెడల అది యిప్పుడున్నసంస్థలకు మాత్రమే గాక ఉత్తరోత్తర ఏర్పడగల సంస్థలకుకూడా కేంద్రపీఠముగా నుండవలెను.

## మత కుల సంఘ సామరస్యము

ఈసభవారు పైజెప్పిన రెండు ముఖ్యవిషయములను చర్చించుటకు ఎక్కువకాలము వినియోగించిరి. కాని గాంధిజీ తన చివరి దినములలో మతసంఘముల సామరస్యమునకై ఎక్కువగా కృషి చేసియుండెను. ఈమతసంఘ సామరస్యము నకే ఆయన తనప్రాణము లర్పించెను. కనుక యీమతసంఘ సామరస్యమునకై కొంత పనిచేయవలసియున్నదని యీసభకు హాజరైనవారందరును తలంచిరి. ఈసాంఘిక సామరస్యము చాలా ప్రధానమైన విషయమని గాంధిజీ వాదించెను. కాని, దురదృష్టవశమున, ఆయన ఆవిషయములో ఎంతగా కృషి చేసెనో అంతగా ఆయన ప్రయత్నములను లోకులు అపార్థము చేసికొనసాగిరి. ఆయన ప్రయత్నములకు అంతగా చిక్కులు ఏర్పడెను. ఈహిందూ మహమ్మదీయ సంఘర్షణవల్లనే దేశము రెండు రాజ్యాలుగా విభాగమవుట కూడ తటస్థించెను. ఇప్పుడా గాథయంతయు విమర్శించవలసినపనిలేదు.

దేశవిభాగమునకు పూర్వమున్ను అనంతరమున్ను దేశము చాలా సంక్షోభముపాలైనది. వేలకొలది స్త్రీలు పురుషులు ప్రాణములు గోల్పోయిరి. కోట్లకొలది సొత్తునాశనమైనది. లూటీచేయబడినది. లక్షలకొలది హిందువులు సిక్కులు మాత్రమేకాక మహమ్మదీయులు కూడా స్వస్థానములను విడనాడి కాందిశీకులై అష్టకష్టములపాలై అన్యప్రాంతములకు

వెళ్ళిరి. ఇంకను అనేకలక్షలమంది హిందువులు సిక్కులు పశ్చిమ పాకిస్తానులో చిక్కువడియున్నారు. వారు భారత దేశానికి రావలెనని అవకాశమునకై నిరీక్షించుచున్నారు. ఈవిధముగా యింతవరకు పాకిస్తానునుండి ఇండియాకుగాని ఇండియానుంచి పాకిస్తానుకుగాని పరారైనవారిసంఖ్య ఉభయ పక్షములలోను 50 లక్షల వరకు లెక్కకు తేలుచున్నారు. అదేవిధముగా తూర్పు పాకిస్తానునుండి సుమారు 8 లక్షల మంది హిందువులు పశ్చిమబెంగాలుకు కాందిశీకులైవచ్చిరి. తమ స్వగ్రామములను వదలి వందలకొలది మైళ్ళదూరములో నున్న అరణ్యప్రాంతములకు చేరిన జనులయొక్క కష్టము లెట్టివో సులభముగా ఊహించవచ్చు. అట్టివారిహృదయములు రోషావేశపూరితములై యుండక మానవు. ఇందుమూలముగా మహమ్మదీయులకు మహమ్మదీయేతరులకు పరస్పర బద్ధవైర ములు వృద్ధియగుచుండగలవు. కాబట్టి దేశము రెండుముక్క లుగా విభాగింపబడినందువల్ల మత విద్వేషము వృద్ధియైనదే గానితగ్గలేదు.

## గాంధీపంథా

ఈ విధమైన పరస్పరవిద్వేషాభివృద్ధిని అంతరింప జేయు టకే గాంధీజీ తన తపస్సునంతను ధారబోసెను. ఆయన జీవి తములోని చివరిదినములలో హిందూ మహమ్మదీయ పరస్పర సద్భావ సంస్థాపనకై నిరంతరకృషి చేసెను. ఇంతటి క్లిష్టమైన,

అసాధ్యమైన సాంఘిక వైమనస్యములను తన అప్రతిహా నాస్త్రమైన అహింసావిధానముతో తొలగింపవలెనని పాటు పడెను. భారతదేశములోని హిందువులు సిక్కులు తదితరులు మహమ్మదీయులకు ఇచట, అభయహస్తమొసంగి వారికి ధైర్య విశ్వాసములను కల్పించినయెడల, పాకిస్థానులోని మహమ్మదీయులుకూడా అదేవిధముగా పాకిస్థానులోని మహమ్మదీయే తరులకు అభయహస్తము నొసంగగలరని ఆయన నమ్మియుం డెను. ఆవిధముగా ఆయన బోధించెను. అచంచలసంకల్పుడై ఆ విషయమును నొక్కి వక్కాణించెను. కాబట్టి పాకిస్థాను లోని మహమ్మదీయులు ఏవిధముగా ప్రవర్తించి నప్పటికీ, ఆ విషయముతో నిమిత్తములేకుండా మనమట్టుకు మనము మన దేశములో మహమ్మదీయులను మన సోదరులవలె ఆదరించవలెనని గాంధీజీ బోధించెను.

మన సాంఘిక జీవితములోని యీ విద్వేష విషబీజము లను నిర్మూలించవలెనని యీ సభవారు భావించిరి. కాబట్టి యీ విషయములో గట్టినమ్మకము సద్భావముగల స్త్రీలు పురుషులు తమ వ్యాపార వ్యవహారములలోను తమ జీవిత కార్యకలాపములలోను యిట్టి సామరస్యమునకై కృషిచేయ వలెను. కాబట్టి గాంధీ సిద్ధాంతములందు విశ్వాసము కలవా రును ఆయన ఉపదేశములను అనుసరించెదమనెడి వారును ఈవిషయమును చాలా ముఖ్యమైన అవశ్య కర్తవ్యముగా

భావించి దానికొరకు దీక్షగాపని చేయవలెననియు సభవారు కోరిరి.

లక్షలకొలది జనులు ఘోరమైన క్రూరకృత్యముల జూచి దుర్భర కష్టముల ననుభవించి హృదయావేదన పొందు చున్న స్థితిలో వారి కందరికి తిరిగి తృప్తికరమగు నివాస సౌకర్యములను చూపించనియెడల, ఆయా మతసంఘములవారికి సవ్యమైన సామరస్యముగాని చిత్తస్వాస్థ్యముగాని కలుగ నేరదు. కాబట్టి జాతి మత కుల వివక్షత లేకుండా, యీ కాందిశీకుల కందరికి సహాయము చేయవలసియున్నది. ఈ విధముగా వారి కందరికి పునరావాస సౌకర్యములను కల్పించుట చాలా బ్రహ్మాండమైనపని. ఏ అనధికారసంస్థయైనను యీ పనిని నిర్వ హింపజాలదు. ప్రభుత్వమువారికి గల విశేష ద్రవ్యాధారము వల్లగాని, దృఢసంకల్పము వల్లగాని యీ పని నెరవేర్పబడ జాలదు. ప్రభుత్వము తన శక్తికొలది తన సంపత్తికొలది చేయ తగిన సహాయము చేయుచునే యున్నది. కాని అనధికార సంస్థలుకూడా తమంతట తాము యీవిషయములో అనేక విధములుగా తోడ్పడవచ్చును. అందువల్ల యీ కాందిశీకు లకు సహాయము చేయు విషయమై ఈ నిర్మాణ కార్యక్రమ ప్రచారకుల కొక విజ్ఞాపన చేయబడెను. ఈ విజ్ఞాపన ఫలిత ముగా వినోబాభావేగారు సామర్థ్యానుభవము గల కొందరు ప్రచారకులను తనవెంట తీసుకొని కాందిశీకుల కెట్టి విధముగ సేవచేసి సహాయము చేయవీలగునో, నిర్మాణకార్యక్రమ ప్రచారకులు యీ విషయములో ఎక్కడెక్కడకు వెళ్ళి ఏవిధ

ముగా పనిచేయ సాధ్యమగునో పరిశీలించుటకు బయలుదేరు చున్నారు.

## శాంతి దళములు

ప్రజానీకమునందు శాంతిని నెలకొల్పుటకుమాత్రమే ప్రత్యేకంగా సేవ చేయగలవారిని కొందరిని ఒకబృందముగా సమకూర్చుటసాధ్యమనియు, అవసరమనియు గాంధిమహాత్ముడు చాలాకాలము తలంచుచుండెను. కాని, అనేక కారణాలవల్ల ఆయనజీవించియుండగా అట్టిది నెరవేరలేదు. సాంఘిక విద్వేషములను పోగొట్టవలెనంటే ఇటువంటి సంస్థయొకటి కావలసియున్నది. కాబట్టి "శాంతి సేవాదళము" నెలకొల్పుటకు ప్రయత్నము చేయవలసియున్నది. కొట్లాటలను అల్లరులను అణచివేయునటువంటి పోలీసుదళమువంటిది యీ శాంతి దళముకాదు. ప్రజలలో అల్లరులు కొట్లాటలు ఉద్భవించకుండా ప్రజలలో సామరస్యమును వృద్ధిచేయునిమిత్తము ఈ శాంతిదళములోనివారు ప్రజలతో కలిసిమెలిసి పనిచేయవలెను. ఒకవేళ కొట్లాటలు బయలుదేరినయెడల ఉభయపక్షములవారికి మధ్య యీ శాంతిదళసైనికులు నిలవబడి అట్టి కలహములను నివారించవలెను. లేదా అట్టిసంఘర్షణ తీవ్రతను ఉపశమింపచేయవలెను. ఈ శాంతిదళము నిరాయుధమైన దగుటవల్లను పూర్తిగా అహింసాదీక్షాబద్ధమైన దగుటవల్లను యీ పనిని నిర్వర్తింపగల్గును.

సర్వేజనాః సుఖినోభవంతు

ఓం శాంతిః శాంతిః శాంతిః

# గాంధిగారిజీవితంలో ముఖ్యవృత్తాంతాల కాలసూచి.

2–10–1869 జననము.

1883 వివాహం.

1885 తండ్రి మరణము.

1888 } జ్యేష్ఠపుత్రుని జననం, విద్యకింగ్లండు ప్రయాణము.

1891 బారిష్టరై మరలవచ్చుట.

1893 మొదటిసారి దక్షిణాఫ్రికాకు ప్రయాణము.

1894 అబ్దుల్లా కేసు రాజీ; తలపన్నుబిల్లు, నేటాలులో సత్యాగ్రహారంభం, నేటాలు ఇండియన్ కాంగ్రెసు స్థాపన.

1896 భారతదేశమందు ప్రచారము.

1897 భారతదేశపు క్షామనిధికి సొమ్ము వసూలు.

1899 బోయరుయుద్ధములో చికిత్స, సేవ.

1901 భారతదేశమందు మరల ప్రచారము; కలకత్తా కాంగ్రెసులో పాల్గొనుట.

1903 ట్రాన్సువాలులో సొలిసిటరువృత్తి.

1904 ఇండియన్ ఒపినియను, పత్రికస్థాపన, ఆస్తిస్వత్వం వదలుకొనుట.

1906 ట్రాన్సువాలులో మొదటి సత్యాగ్రహము; జూలూయుద్ధములో సేవ. ఫినిక్సు ఆశ్రమస్థాపన, బ్రహ్మచర్యవ్రతారంభం, లండనులో ప్రచారం, సమిష్టి సత్యాగ్రహం.

1907 ప్రాక్టీసు మానుట, పూర్ణత్యాగం.

1908 మొదటి జైలుయాత్ర, రాజీమోసం, మరల సత్యాగ్రహం, జైలు.

1909 ఇంగ్లండుకు రాయబారము, హింద్ స్వరాజ్ రచన. టాల్‌స్టాయి లేఖలు.

1913 మరల సత్యాగ్రహము, జైలు.

1914 ఉపవాసం, రాజీ, అక్రమపు చట్టాల రద్దు.

1915 భారతదేశమున ప్రవేశము, టాగూరు గాంధిని మహాత్ముడనుట, సబర్మతీ ఆశ్రమ స్థాపన, దేశసంచారారంభం.

1916 హిందూ విశ్వవిద్యాలయ ప్రారంభోపన్యాసము, యంగిండియా నవజీవనపత్రికల ఆరంభము.

1917 చంపారణ సత్యాగ్రహము. గ్రామసేవ, కాంగ్రెసు-లీగు ప్రణాళిక, (నవంబరు) గుజరాతు రాజకీయసభ కధ్యక్షత, (డిశంబరు) అ. భా. సంఘ సేవాసభ కగ్రాసనత

1918 (మార్చి) అహమ్మదాబాదుమిల్లు సత్యాగ్రహము; ఖేరాసత్యాగ్రహము; దక్షిణభారతములో హిందీ ప్రచారము ప్రారంభము; అస్వస్థత.

1919 రౌలటుచట్టం; పంజాబు దుర్ఘటన; సత్యాగ్రహ సభ స్థాపన; యంగుఇండియా, నవజీవన్ సంపాదకత్వము; (నవంబరు) పంజాబు అల్లరులగూర్చి గాంధిగారిరిపోర్టు: ఖిలాఫతుమహాసభకధ్యక్షత.

1920 సర్కారు పదకాల విసర్జన; హోంరూలు సభాధ్యక్షత, కలకత్తా, నాగపురకాంగ్రెసు మహాసభలలో అసహాయోగ తీర్మానాలు; కాంగ్రెసుకు కొత్తరాజ్యాంగం, గుజరాత్ విద్యాపీఠాదులస్థాపన.

1921 అసహాయోగవిజృంభణ, బెజవాడలో నిర్మాణ కార్యప్రక్రియ తీర్మానం, అహమ్మదాబాదు కాంగ్రెసు, త్రివిధబహిష్కారం, సత్యాగ్రహ నియంతృత్వాం.

1922 సాంఘికసహకారసభ (బొంబాయి); పన్నుల నిరాకరణయత్నము; చౌరిచౌరా అల్లరి; సత్యాగ్రహపునిల్పుదల, కేసు, శిక్ష; యరవాడ జైలు.

1923 జైలులో సౌకర్యాలువదలుట; కాకినాడ కాంగ్రెసువారు నిర్మాణకార్యక్రమమునకుతోడ్పాటు.

1924 శస్త్రచికిత్స, విడుదల; హిందూముస్లిం కలహాలు, సాంఘికమైత్రికై 21 రోజులఉపవాసం, బెల్గాంకాంగ్రెసుఅధ్యక్షత; మరల యంగిండియా

1925 ఆశ్రమవాసుల లోపమునకు వారం ఉపవాసం. అ. భా. చరఖాసంఘుప్థాపన; అ. భా. కాంగ్రెసులో హిందూస్తానీభాష వాడుటకు కాంగ్రెసు తీర్మానము.

1926 చీనాకు సానుభూతి సందేశం.

1927 సింహళాదులయాత్ర; మద్రాసు కాంగ్రెసులో పూర్ణస్వాతంత్ర్యపు తీర్మానం; గాంధిగారి విమర్శ.

1928 బర్డోలీ సత్యాగ్రహం; కలకత్తా కాంగ్రెసులో రాజీతీర్మానం.

1929 ఇర్విన్‌తో రాయబారం: ఆంధ్ర బర్మాయాత్రలు లాహోరులో పూర్ణస్వాతంత్ర్యపు తీర్మానం ఉపపాదన.

1930 స్వాతంత్ర్యదీక్ష; నియంతృత్వం: ఉప్పుసత్యాగ్రహం, జైలుయాత్ర.

1931 గాంధి—ఇర్విను సమాఖ్య, లండనుసభలోకాంగ్రెసుప్రతినిధిగ పాల్గొనుట.

1932 మరల నిర్బంధము; సత్యాగ్రహతీవ్రత; హరిజనసమస్యకు ఉపవాసం; యరవాడ సమాఖ్య.

1933 మరల ఉపవాసాలు; హరిజనసేవక సంఘస్థాపన; హరిజనపత్రికారంభం; దేశసంచారం, సేవాగ్రామ ఆశ్రమస్థాపన.

1934 అ. భా. గ్రామపరిశ్రమసంఘస్థాపన; కాంగ్రెసుసభ్యత్వమును వదలుకొనుట.

1935 భారతీయ సాహిత్యపరిషత్తు స్థాపన, హిందీసాహిత్యసమ్మేళనపు అధ్యక్షత, గుజరాతు సాహిత్య సమ్మేళన సభ కధ్యక్షత.

1937 కాంగ్రెసు మంత్రిత్వపు ఆరంభం, హిందీ సమ్మేళనంలో ఉపన్యాసము, వార్ధాలో నవ్య విద్యాసభ, భారతీయ సాహిత్యసభ కధ్యక్షత.

1938 హరిపుర కాంగ్రెసు, ఖాదీస్వదేశీ ప్రదర్శనము, సరిహద్దురాష్ట్రంలో సంచారము.

1939 రాజకోటలో ఉపవాసం, గాంధి సుభాషుల విభేదం, మహాయుద్ధారంభం, కాంగ్రెసు మంత్రి వర్గాల రాజీనామా.

1940 రామగఢ్ కాంగ్రెసు, వ్యక్తిసత్యాగ్రహ ప్రారంభం, వైస్రాయితో సంభాషణలు.

1941 యుద్ధంలో దేశరక్షణ, అహింసాపద్ధతిని గూర్చి కాంగ్రెసుతో భేదాభిప్రాయం; జపాను యుద్ధ ప్రకటన.

1942 జమ్నాలాల్ బజాజ్ మరణం, క్రిప్సు రాయబారం, కాంగ్రెసులో 'క్విట్టిండియా' తీర్మానం, గాంధి ఇత్యాదులందరి అరెస్టు, ఆగాఖానుభవనంలో నిర్బంధం, దేశంలో అల్లరులు, సర్కారు నిరంకుశచర్యలు, మహాదేవ దేశాయి మరణం.

1943 ప్రభుత్వంతో కాంగ్రెసు నిర్దోషిత్వాన్నిగూర్చి లేఖలు, ఉపవాసం (21 రోజులు). మహోత్సాహం.

1944 (శివరాత్రి) కస్తూరిబాయి మరణం, మే 6 న గాంధిగారి విడుదల, చరఖాసంఘ పునర్నిర్మాణం, జిన్నాగారితో పాకిస్థానుగూర్చి దీర్ఘ సంభాషణ, కస్తూరిబా జాతీయ స్మారకనిధి కధ్యక్షత, జర్మనీయుద్ధ సమాప్తి.

1945 కాంగ్రెసునాయకుల విడుదల, సిమ్లా (మొదటి) సంభాషణలు, అ. భా. హరిజన సేవకసమితిలో సంభాషణ, జపానుయుద్ధాంతం, కలకత్తా, సోదేపురాశ్రమ యాత్ర.

1946 మద్రాసుకుహిందీప్రచారయాత్ర, రజతజయంతి, బ్రిటిషు మంత్రిత్రయంతో చర్చలు, మే 16 న రాజ్యాంగ ప్రణాళిక, ఇంటరిం ప్రభుత్వ స్థాపన, కలకత్తా నవఖాలీ బీహారుల హింసాకాండ, తూర్పు బెంగాల్ యాత్ర.

1947 బీహారుయాత్ర, పంజాబు సరిహద్దురాష్ట్రల హింసలు, క్రొత్తవైస్రాయితో సంభాషణలు, ఆసియా మహాసభ, పాకిస్తాను – హిందుస్తానుల నిర్మాణము, కలకత్తాలో శాంతిస్థాపన, ఢిల్లీలో కల్లోలం పోగొట్టుట, కాశ్మీరయుద్ధం.

1948 హిందూముస్లిం సఖ్యతకు ఉపవాసం, నిర్యాణం, లోకమంతట శోకసంవాదం, సర్వోదయ సమాజ స్థాపన, రాజ్యాంగ నిర్మాణం.

# ఈ రచయిత వ్రాసిన మరికొన్ని పుస్తకములు

నెహ్రూచరిత్రము, (4 వ కూర్పు) 300 పుటలు. మోతీలాలు జవహర్లాలుల జీవిత కథ, జాతీయోద్యమకథ, రాజ్యాంగ సమస్యల చర్చ సహా. వెల. రు. 2_4_0

మౌలానా ఆజాదు చరిత్రము, అబ్దుల్ కలాంగారి జీవితం, సాంఘిక సమస్య వివరణ సహా,
రెండవకూర్పు 300 పుటలు వెల. రు. 1_0_0

నిర్మాణ కార్యక్రమము, మహాత్మాగాంధి, రాజేంద్ర ప్రసాదుగార్ల రచనల కనువాదం, వివరణ. 0_10_0

భారతీయ నాగరికత, అహింసా తత్వం 2 వ భాగం ఆధునిక సమస్యల పరిశీలన 280 పుటలు. 0_12_0

జమీందారీ కమిటీ రిపోర్టు, జమీందారీల ఉత్పత్తి స్వభావం వగైరాలు తెల్పును. ప్రకాశం కమిటీ రిపోర్టు సంగ్రహం 200 పుటలు. 0_4_0

---

ప్రతులకు:—

**కో. శఠకోపం, వకీలు,**

కాకినాడకు, వ్రాయుడు.

